# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౧౯]  30 ఏప్రిల్ 1947  [సంచిక ౪




సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. ప్రచురింపబడని వ్యాసములకు తపాలాబిళ్లలు పంపిన వాపసు చేయబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బాంకులపైననే పంపవలెను

# విషయసూచిక.

# శ్రీ సర్వజిత్ నామ సం॥ వైశాఖ జ్యేష్ఠమాసములు.

1947-వ సం॥ మే నెల

| | | |
|---|---|---|
| 1 | గు | ఏ 13.0 పూ ఫ 3.6 వ్యా 43-47 భ 13.5 దివ 20.50 |
| 2 | శు | ద్వా 10.21 ఉ ఫ 2.5 హ 39.35 బా 10-22 దివ 23-12 [నరసింహ గరుడోత్సవం |
| 3 | శ | త్ర 8.55 హ 2-17 వజ్ర 36-21 తై 8.54 దివ 22.48 నరసింహజయంతి పెంచలు |
| 4 | ఆ | చతు 8-45 చి 3.41 సి 34-7 వనపి 46 దివ 18-19 [వేదగిరి గరుడోత్సవము |
| 5 | సో | ○ పౌ 9.46 స్వా 6-18 వ్య 32.47 బ 94-8 దివ 21.11 వ్యాసపూజ |
| 6 | మం | కృ పా 11-54 వి 10-2 వర్యా 32.12 కౌ 11.55 దివ 20-47 |
| 7 | బు | ది 14-59 అను 14-36 పరి 32-23 గర 14-59 దివ 29-53 కర్తిర ప్రవేశం |
| 8 | గు | త 18-46 జ్యే 19-58 శివ 33-6 భ 18-50 రా 10-22- |
| 9 | శు | చ 23-8 మూ 25-47 సి 34-8 బా 23-7 దివ 21-22 రా 20.38 |
| 10 | శ | పం 27-42 పూ షా 31-49 సా 35-20 తై 27-42 రా 22-11 |
| 11 | ఆ | ష 32-10 ఉ షా 37-46 శుభ 36-24 వన 32-9 రా 17-4 |
| 12 | సో | స 36-21 శ్ర 43-24 శుక్ల 37-17 భ 4-10 రా 22.35 |
| 13 | మం | అ 39-57 ధ 48 30 బ్ర 38-50 బా 8.3 త్యాజ్యభావః |
| 14 | బు | న 42-43 శత 52-43 ఐ 38-28 తై 11-14 దివ 37-37 |
| 15 | గు | ద 44.28 పూ బా 55-47 వైధృ 36-28 వైధృ 36-26 ది 9-29 హనుమజ్జయంతి |
| 16 | శు | ఏ 45-3 ఉ భా 58-2 విష్క 34-29 బవ 14-40 దివ 20-40 |
| 17 | శ | ద్వా 44-23 రేవ 58-52 ప్రీతి 31-38 కే 14-26 దివ 28-23 |
| 18 | ఆ | త్ర 42-26 అశ్వ 58-29 ఆయు 27-43 గర 13-24 రా 16-49. జన్నవాడ నందిసేవ. |
| 19 | సో | చతు 39-8 భ 54-54 సౌ 22-53 భ 10.47 దివ 21-44 జన్నవాడ రథోత్సవము. |
| 20 | మం | ● అమా 35-4 కృ 54-14 శో 17-7 చతు 7-6 దివ 25-28 జన్నవాడ కామాక్షి |
| | | జ్యేష్ఠమాసము. [కళ్యాణము |
| 21 | బు | శుక్లప్రపా 29-52 రో 50-4 అ 9-3 కిం 2-23 దివ 31-46 |
| 22 | గు | దివ 24-2 మృ 46-30 సు 3 25 ధృ 52-22 దివ 3-33 రంభావ్రతం |
| 23 | శు | త 17-3) ఆ 41-58 శూ 47-40 గర 17-40 దివ 5-48 గౌరీ వ్రతం |
| 24 | శ | చ 11-6 పున 37-22 గం 39 37 భ 11-8 దివ 9-35 రా 24.0 ఉమా వ్రతం |
| 25 | ఆ | పం 4-37 పుష్యం 53-36 వృ 32-58 వృద్ధి 31-43 బా 4-37 త్యాజ్యభావం |
| 26 | సో | స 52-29 ఆశ్రే 29-1 ధృ 24-16 గ 25-15 దివ 2.46 రా 25-30 |
| 27 | మం | అ 47-38 మ 25-44 వ్యా 17-18 భ 19-59 రా 13-4 |
| 28 | బు | స 43-46 పూ ఫ 24-23 పూ 11-8 బా 15-38 రా 9-3 [రామేశ్వర ప్రతిష్ఠ |
| 29 | గు | ద 41-2 ఉ 22-6 వ 5-45 తై 12-20 రా 11 9 గంగాపూజ; పాపహరదశమి, |
| 30 | శు | ఏ 39-30 హ 22-0 సి 1.15 వ్య 56-27 రా 10-25 నిర్జలైకాదశి |
| 31 | శ | ద్వా 39-15 చి 23-8 వర్యా 55-10 బా 9-17 రా 5-40 రాములక్ష్మణ ద్వాదశి |



డాక్టర్ కే. యన్. కేసరిగారు.




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యా ప్రబోధ! జయ కల్యాణీ!

---

# కేసరీ కన్యా విద్యాలయము.

"కేసరీ కన్యా విద్యాలయమును స్థాపింపుడు" అని కేసరీ హైస్కూలు కమిటీవారి పరంగా ఒక లక్షరూపాయలను శ్రీ డాక్టరు కే. యన్. కేసరిగారు అప్పజెప్పినారు. దీనికి నారీలోకమంతా వారికి జోహారు లొనర్చి తీరుతారు.

ఈ చెన్నపట్నానికి రిక్తులుగా వచ్చి - స్వయంశక్తి సామర్థ్యాలతో, లక్షలాది ఆర్జించిన మహనీయులెందరో, లక్షలకొలదిగా విద్యాలయాలకు దాన ధర్మాలు చేసినారు. అట్టి పచ్చయప్పమొదలి, గోవిందునాయుడు, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ల, పెణత్తూరు సుబ్రహ్మణ్యయ్యర్, కలవల సోదరులు, మొదలైన దాతల శ్రేణిలో ఉత్తమస్థానము నలంకరింప దగినవారు శ్రీ డాక్టరు కేసరిగారు.

ఇప్పటికే కేసరీ హైస్కూలునకు దాదాపు రెండులక్షల వరకు దఖలుపరచినారు. నేడు ప్రత్యేకంగా కేసరీ కన్యావిద్యాలయం కొరకు లక్షరూపాయలను అయాచితంగా, సునాయాసంగా ఇచ్చేశారంటే, ధనం సంపాదించాలనే యత్నంలో ఎంత దీక్ష, పట్టుదల వహించారో, ప్రజాహితార్థమై దానిని దానం చేయడంలోనూ, అలాంటి పట్టుదల, దీక్ష గట్టిగా వారు వహించినారా-అని తోస్తున్నది. అందుకు వారెంతైనా అభివందనీయులు.

శ్రీ శ్రీ ఆనందగజపతి మహారాజులుంగారుమున్నగు జమీందార్లు, శ్రీ మందపాటి రామ కృష్ణయ్యగారు, శ్రీ విశ్వదాత నాగేశ్వరరావు పంతులుగారు, మొదలైన శ్రీమంతులగు ఆంధ్ర ప్రముఖు లెందరో వితరణతో, చెన్నగరంలో చాలాదానము లొనర్చియున్నారు. శ్రీ డాక్టరుగారు ఆపరంపరలో జేరి - ఏనాటికైనా ఆంధ్రులు గర్వంగా చూపిచెప్పగల - దానము లొనర్చి ధన్యులైనారు. ఏమంటే, వారిదానంవల్ల ఆంధ్రులకు తీరని కొరత, తమ బిడ్డలకు మాతృభాషలో నిరాటంకముగా విద్యాబోధ గావించే సంస్థలు లేననే కొరత, తీరినది.

శ్రీ డా. కేసరిగారి నాంధ్ర నారీలోకము తరఫున అభినందించుచు, ఇతోధి కాయురారోగ్యైశ్వర్యముల నీశ్వరుడు ప్రసాదించుగాక యని కోరుచున్నాను. కేసరీ హైస్కూలు కమిటీవారును అచిరకాలములో - నీ "కేసరీ కన్యావిద్యాలయము" నెలకొల్పుదురుగాక అని ఆశించుచున్నాను.

# కేసరీ హైస్కూలు వార్షికోత్సవము

కేసరీ హైస్కూలు జీవితమున మరొక్క సంవత్సరము గడిచి జయప్రదముగ వార్షికోత్సవమును జరుపబడినందులకు మేమెంతయు హర్షించుచున్నాము.

ఈ హైస్కూలు దినదిన ప్రవర్ధమానమై అచిరకాలముననే అత్యున్నతికి రాగలిగినందులకు పరిపాలకవర్గమే గాక, ఆంధ్రులందరును గర్వింపదగినది.

చెన్నపట్నమున ఆంధ్ర బాలబాలికలకు ఆంధ్రమున బోధించు పాఠశాలల అవసరము నీ హైస్కూలు అభివృద్ధియే వేనోళ్ల చాటుచున్నది. ఇట్టివి చెన్నపురిలో పేట కొక్కటి అవసరమన్నచో అతిశయోక్తి కాజాలదు.

వితరణ శీలురగు శ్రీ డా. కే. యన్. కేసరిగారు దీనికి ప్రధాన పోషకులగుట దీనిభాగ్య విశేషము. సమర్థులు, విజ్ఞానసంపన్నులు, యువకులు నగు శ్రీ యమ్. శేషాచలపతి పంతులుగారు కార్యదర్శిగను, వీరికన్నివిధముల ప్రోత్సాహమొసంగు పెద్దలు కమిటీగను అమరుట దీనియదృష్టము. కాలేజి అధ్యాపకులు కాదగిన శ్రీ రాజగోపాల్ రావుగారు త్యాగబుద్ధితో ప్రధానోపాధ్యాయులై చాకచక్యమున దీనిని నడుపుచుండుటయు ప్రశంసార్హము.

సర్వవిధముల నిది అభ్యుదయ పరంపరల నందుచు త్వరలో కాలేజీ యగుగాక.

రా. వెంకటప్ప.

# కేసరీ హైస్కూలు

వార్షికోత్సవము

---

మద్రాసు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి

## శ్రీ సర్. కొండి వెంకట రామమూర్తి పంతులుగారు

అధ్యక్షత వహించిరి

---

## స్త్రీ విద్యకు కేసరిగారి లక్ష రూపాయల విరాళం

1940 లో తెలుగు పిల్లలకు తెలుగులో విద్యాబోధన మొనర్చుటకుగాను ఏర్పడిన పాఠశాల క్రమముగా కేసరీ యున్నతపాఠశాలయై దిన దిన ప్రవర్ధమాన మగుచున్నది. శ్రీ డా. కే. యన్. కేసరిగారు ప్రధాన పోషకులై దాని కన్నివిధముల ధనసహాయ మొనర్చుచు పరిపాలక వర్గమునొండేర్పరచి వారికి దాని పెత్తన మప్పచెప్పినారు. సమర్థులగు శ్రీ మైదవోలు శేషాచలపతి పంతులు ఎం. ఏ. బి. యల్ గారు ఆ పరిపాలక వర్గమునకు కార్యదర్శియై స్కూలు నన్నివిధముల నభివృద్ధిలోనికి తెచ్చుచున్నారు.

ఈ నెల 19 వ తేది కేసరి హైస్కూలు వార్షికోత్సవము జయప్రదముగ జరుపబడినది. శ్రీ సర్. కొండి వెంకటరామమూర్తి పంతులుగారు అధ్యక్షత వహించిరి.

సాయంకాలము 5½ గంటలకు-సభకు విచ్చేసిన పెద్దలందరిని పుష్పచందనముల సత్కరించి, పోటో తీయబడిన వెంటనే సభ సమావేశమైనది. ప్రార్థనాంతరము-అధ్యక్షుని కోరికపై-కార్యదర్శి శ్రీ శేషాచలపతి పంతులుగారు గతవార్షిక నివేదికను చదివిరి. (ఈ నివేదికయందలి ముఖ్యాంశములన్నియు ఈ జనవరి సంచికయందలి కేసరి ఉన్నత విద్యాలయ కమిటీవారి విజ్ఞప్తియందు వివరింపబడి యున్నవి. గృ॥ సం॥.)

తదనంతరము శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు పంతులు బి. ఏ. యం. యల్ గారు విద్యాలయము పుట్టుపూర్వోత్తరములు చెప్పి-శ్రీ డా. కేసరిగారి వితరణయు, స్కూలు విషయమున వారుచూపుచున్న శ్రద్ధయు, స్కూలు నిర్వాహణ కవసరముల తీర్చగలునట్లుగా వారికిగల బహుముఖ సామర్థ్యములను ఉగ్గడించి క్రమముగా నీస్కూలు కాలేజీ కావలయునని ఆశించుచు, శ్రీ డాక్టరుగారి కాయురారోగ్యముల నభిలషించుచు తమ యుపన్యాసమును ముగించిరి. ఆపిదప శ్రీ కేసరిగారు, విడిగా ప్రచురింపబడిన తమ "జీవిత వృత్తాంతము" ను వివరముగా నుడివిరి. శ్రీ "కేసరీ కన్యా విద్యాలయము" నకై లక్ష రూపాయల చెక్కును-అధ్యక్షుని అనుమతితో కమిటీవారికి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు గారిద్వారా అందజేసిరి.

ఆతరువాత అధ్యక్షులిట్లని ఉపన్యసించిరి:—

కేసరిగారి జీవితచరిత్ర విని చాలగర్వించు చున్నాము. సద్గుణం, సమర్థతగలవారు ఎప్పటికీ పైకి రాగలరనుటకు యిదొక నిదర్శనం. మనజీవితంలో ఎక్కువభాగం వ్యవహారం అంతా మాతృభాషలోనే

జరుగును. ఆమాతృభాష వ్యవహారానికి సరిహద్దు స్వరాష్ట్రం. కాని ఒకరాష్ట్రం యితర రాష్ట్రంతో వ్యవహరించుటకు హిందూస్థానీయు, యితర దేశాలతో వ్యవహరించుటకు ఇంగ్లీషు వచ్చితీరాలి. రాజ్యాంగ పరిషత్తుసభలో హిందూస్తానీభాషయే ఇండియా సమిష్టి భాషగా గుర్తించబడెను. కనుక మనవారు తెలుగు హిందీ, ఇంగ్లీషు నేర్చుకోవలసి యుండును. ప్రపంచమంతా ఒకటే అనేసిద్ధాంతం మన పూర్వీకులు ఎన్నో ఏండ్లక్రిందట కనిపెట్టిరి. అమెరికా యిటీవల కనిపెట్టెను. యూరోపు యింకా ఆ సిద్ధాంతం అంగీకరించుటకు సందేహిస్తున్నది. కేసరిగారు తెలుగువారి విజ్ఞానాభివృద్ధికి భూరి విరాళమిచ్చి, ఇవ్వడమేగాని పుచ్చుకోడం ఎరుగని నిష్కామకర్మకు ఆదర్శ జీవులుగ నున్నందుకు వారిని అభినందించుచున్నాము.

అధ్యక్షుని ఉపన్యాసానంతరం విద్యార్థులకు విద్యార్థినులకు విద్యలందును, ఆటలందును ప్రావీణ్యమునకై బహుమానములను అధ్యక్షులు పంచిపెట్టిరి.

ఆతరువాత విద్యార్థులు క్రమముగా గొల్లవేషములు, చంద్రగుప్త మున్నగు కొన్ని నాటకముల సీనులు, వినోదములు గావించిరి. అందు చక్కగా నటించినవారికి బహుమతులొసంగిరి. కడుసామర్థ్యమున నీ యుత్సవమును వినోదములను ఏర్పాటు గావించి చిన్న బాలబాలికలకు నాటకముల, ప్రహసనముల వివిధ పాత్రల నిర్వహింప తర్ఫీదు నిప్పించిన ప్రధానోపాధ్యాయులు శ్రీ యస్. రాజగోపాలరావు ఎం. ఏ. ఎల్. టి గారిని సభాసదులెల్లరు మెచ్చుకొనిరి. శ్రీ రాజగోపాలరావుగారు సభకు విచ్చేసిన వారికి, అధ్యక్షులకు వందనము లర్పించి, ప్రదర్శనములు గావించిన బాలబాలికలను ఆశీర్వదించిన పిమ్మట మంగళహారతితో సభ ముగిసినది.

——:o:——

## స్త్రీల హక్కులు

ఆసియా ఖండంలోని స్త్రీల హక్కులను నిర్వచిస్తూ శ్రీమతి లీలామణి నాయుడు ప్రభృతులు తయారుచేసిన నివేదికను ఆసియా వ్యవహారాల మహాసభవారు ఆమోదించారు. ఆ నివేదికలో ఇలాఉన్నది.

మతం, శాసనం, ఆచారం మొదలైన కారణాలవల్ల స్త్రీలకి కలిగిన అన్యాయాన్ని తొలగించాలి. హక్కుల విషయంలో ఆస్తిభాగాల విషయంలోను, వివాహం, విడాకులు మొదలైన విషయాలలోను స్త్రీలకు పురుషులకు ఎట్టి భేదము ఉండగూడదు.

బహు భార్యాత్వము, బహుభర్తృత్వము నిషేధించాలి. తలిదండ్రుల అనుమతితో వివాహం జరిగేటప్పుడు వధువు వయస్సు 16, వరునివయస్సు 18 కి, తక్కువ గాకుండా ఉండాలి. తల్లిదండ్రుల అనుమతి లేకుండా వివాహం చేసుకుంటే ఈ పరిమితి కనీసం 18-21 కి హెచ్చించాలి.

అఖిల ఆసియా మహిళా మహాసభను పునరుద్ధరించాలి. విదేశీయుల పరిపాలన వచ్చిన తర్వాత భారతీయ మహిళల హక్కులు తగ్గిపోయినవి. కనుక వీరి హక్కులను పునరుద్ధరించడానికి పూనుకోవాలి.

5 మాసములకే హఠాత్తుగా మా తండ్రి కలరా జాడ్యమువల్ల స్వర్గస్థుడైనాడు. మా నాయనగారు చనిపోవునప్పుడు - ఆయన జంధ్యాలు వడుకుకొంటూవచ్చిన టెంకాయ చిప్పలో రు 0-10-0 లు రొఖం మాత్రం నిలువచేసి వెళ్లిపోయినారు. అదీ నా పిత్రార్జితము. ఆ పిదప మా తల్లి ఎన్నెన్ని కష్టములోపడి 10, 11 సం॥ లు నన్ను కష్టము తెలియనివ్వకుండా పెంచి పెద్ద వానిని చేసినది. ఆ పిదప ఆమెకు అశక్యమైనది ; నా అన్నమునకు కూడా ఆమె ఎంతో కష్టపడుతూ వచ్చినది. నాకు ఊహ తెలిసినది. ఆమె కష్టము చూడలేకపోయినాను. ఒకనాడు జుగుప్సతో — మా గ్రామం వదలిపెట్టి, కాలి నడకన దారి మకాములు చేసుకుంటూ చెన్నపట్నం చేరుకున్నాను. ఆ రోజులలో రైళ్లు లేవు. ఎవరైనా బండ్ల మీద, బక్కింగ్ హామ్ కాలువపై పడవలలో, లేనిచో కాలి నడకతో—చెన్నపట్నం రావలసినదే. నాకు కాలినడకే అనుకూలమైనది. చెన్నపట్నం రాగానే కొత్వాల్ చావడి వద్ద రావిచెట్టు అగ్రహారం ప్రవేశించినాను. ఆ అగ్రహారంలో ఉండేవారు పలువురు ఉత్తరాదినుంచి వచ్చి చేరిన పేద బ్రాహ్మణులు. వారందరు - పౌరోహిత్యముచేసియో, లేక బిచ్చమెత్తుకొనియో జీవించేవారు. నేనున్నూ ఆ జట్టుతో చేరి వారివలెనే జీవిత మారంభించినాను. ఆ కాలంలో చెన్నపురియందు బ్రాహ్మణులకు అన్నంపెట్టే ధర్మసత్రములు చాలా ఉండేవి. అయితే వాటిలో ఒకపూటే అన్నం పెడతారు. ఆ ఒక పూటతిని, ఉండడానికి ఇల్లులేని కారణమున రావిచెట్టు క్రిందనే పడుకునేవాడిని. పసివాడను కావడంచేత రాత్రి ఆకలివేసేది. ఒక్కొక్కరోజు ఆ ఆకలికి తట్టుకోలేక పోయేవాడిని. అప్పుడు ప్రక్కనున్న కొత్వాల్ చావడికి వెళ్లితే, అక్కడ మొక్కజొన్న పేలాలు పడి రెండు దమ్మిడీలకు ఇచ్చేవారు. ఒక్క దమ్మిడీపెట్టి—అరసడి పేలాలు కొనుక్కొని తిని మంచి నీళ్లు త్రాగి, రావి చెట్టు క్రిందికి తిరిగి చేరి నిద్రపోయేవాడిని. ఈ విధంగా చెన్నపట్నంలో రావి చెట్టు క్రింద కాపురం కొన్నాళ్లు సాగించినాను. పిమ్మట ఆ బ్రతుకు నాకు చాలా అసహ్యంగా తోచినది. చదువు కొందాము - అనే ధ్యాస కలిగింది.

పచ్చయప్ప కాలేజీ భవనానికి (జార్జిటౌన్లో) ప్రక్కన నారాయణమొదలి వీధి అని యొక వీధి ఉన్నది. ఆ వీధిలో—రామానుజాచారిగారని యొకరు, వీధి బడి పెట్టుకొని చిన్నపిల్లలకు చదువులు చెప్పేవారు. వారు పిల్లల తల్లిదండ్రులనుండి జీతాలు పుచ్చుకొనేవారు. విద్యాతురుడనైన నేను తిన్నగా వారి నాశ్రయించి - జీతము లేకుండా చదువు చెప్పమని—వారి అనుగ్రహం పొందినాను. వారి అనుగ్రహం పొంది విద్యార్థిని కావడంచేత వారి ఇంటికి వెళ్లి—వారికి శుశ్రూష చేసేవాడిని. వారు నాయందు దయగలిగి చదువుతో నాచేత కాళ్లు పట్టించుకొనేవారు ; ఇంకా ఇతరమైన ఇంటిపనులు చేయించుకొనేవారు. నాయందున గ్రహించి ఉచితంగా విద్యా దానంచేసే గురువులకు అగ్రహారికులు [illegible] సహస్రాలు చేశే

వాడను. వారి వద్దనే రుక్మిణీ కళ్యాణం, గజేంద్ర మోక్షము మొదలైన పద్యకావ్యములు అర్థ సహితంగా చదువుకున్నాను. కాని నాకు చూచే కొద్దీ ఈ చదువు బ్రతుకు తెరువుకు పనికిరాదని తోచినది. ప్రైవేటుగా నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్వసాగినాను. ఇంగ్లీషు విద్యపై మనసు కలిగినది.

1889-లో టంకసాల వీధిలో శ్రీ సచ్చిదానంద యోగి రామనాథ శివశంకరపాండ్యా గారు - హిందూథియలాజికల్ హైస్కూలు స్థాపించి ప్రధానాధ్యాపకులై నడిపింపనారంభించినారు. 1888 లో క్రిస్టియన్ కళాశాలలో నొక ఆంగ్లేయాధ్యాపకుడు — హిందూ మతమును దూషణ పూర్వకముగా అపహాస్యం చేయుటచే నాటి హిందువులలో అలజడి బయలుదేరింది. క్రొత్తగావచ్చిన ఆంగ్ల విద్య నేర్చుటతోపాటు బిడ్డలు మతాంతరులు అవుతారనే భయము కలిగినది. దాని ఫలితముగా నీ హిందూథియలాజికల్ హైస్కూలు ఏర్పడినది. శ్రీ పాండ్యాగారు సంస్కృతాంధ్ర ఆంగ్లభాషా కోవిదులు ; ప్రెసిడెన్సీ కాలేజీలో బి. ఏ ప్యాసైనవారు. దైవచింతగలవారు ; దయాపరులు. వారి నాశ్రయించి తిన్నగా ఆ పాఠశాలలో జీతం లేకుండా చదువుకొనే వసతి ( **Scholar - ship** ) సంపాదించినాను. వారొకనాడు క్లాసుకువచ్చి-విద్యార్థుల రిజిస్టరులో పేరులు చదివి హాజరు వేయుచుండిరి. "కె. నరసింహం" అనగానే ఇద్దరము ఆపేరు గలవారము లేచి నిలచినాము. ఇద్దరికి ఒకే పేరు చిక్కుగా ఉన్నది. అని వారు తలచి - నాయందు చనువుచే నావంక చూచి—" నీపేరు అర్థము చెడకుండా కొద్దిగా మారుస్తాను" అన్నారు. నేను సమ్మతించినాను. అంతట— 'కోట నరసింహం' అనే పేరులో, 'సింహం' అర్థముగల "కేసరి"పదమును సింహమునకు బదులుచేర్చి - 'కోట నరకేసరి' అని మార్చిరి. నేను అంగీకరించితిని. అది మొదలు నా మిత్రులందరు నన్నా పేరటనే పిలువ నారంభించిరి. అది మొదలుగా మా తండ్రి నామకరణ మొనర్చిన—'నరసింహం' అనే పేరు తొలిగి గురువుగా రొసగిన - "నర కేసరి" పేరు కలిగి తుదకీనాటివరకు అదియే 'కే. యన్. కేసరి' అని వ్యవహారనామమై వెలయుచున్నది. అయితే పాండ్యాగారి దయవల్ల జీతమైతే అవసరము లేకపోయిందేగాని, పుస్తకాలకు, గుడ్డలకు, భోజనానికి ఇబ్బంది మాత్రం అట్లాగే ఉన్నది. భోజనానికి కొన్ని ఇండ్లలో వారాలు ఏర్పాటుచేసుకొన్నాను. పుస్తకాలకు, గుడ్డలకు, - ఆ ప్రాంతంలో వ్యాపారం చేసుకొనే కోమట్లవద్ద నెల 1 కి తలా రు 0-4-0 చందా ఇచ్చే ఏర్పాటు చేసుకొన్నాను. ఒకనాడు కొన్ని పుస్తకాలు కొనవలసి వచ్చినది. ఇంకా నెలసరి చందా ఇచ్చే గడువు రాలేదు. జార్జిటౌన్ ఆదియప్ప నాయక్ వీధిలో - నరసింహులు శెట్టి అని - జగ్గయ్యపేట వర్తకులు వ్యాపారం చేస్తుండేవారు. నాయున్నా పై చందా ఇచ్చే వారిలో వకరు. వారి వద్దకు వెళ్లి - "మీరు మామూలుగా ఇచ్చే రు 0-4-0 లు అట్టుంచి - మరొక్క పావులా

అదనంగా ఈ రోజున ఇవ్వండి; పుస్తకాలు అగత్యంగా కొనవలెను." అని సాహసించి అడిగినాను. వారు దగ్గరకు రమ్మనిరి. అడిగిన తడవుగానే ఇవ్వబోతున్నారనే - ఆశతో, ధైర్యముతో దగ్గరకు వెళ్లినాను. 'మామూలుగా ఇచ్చే పావులా గాక పైన ఒక పావులా వడ్డీగూడా కావాలా' అంటూ - చెళ్లున చెంపకాయ గొట్టినాడు. అది దూసిపోయి నెమరు కణతన తగిలినది; స్పృహతప్పి పడిపోయినాను. ఆశబ్దం విని సెట్టి భార్య లోపలనుంచివచ్చి నది. నా అవస్థచూచి 'ఆ పిల్లవానిని అట్లా ఎందుకు కొట్టా'వని మగని గద్దించి - చాలా నొచ్చుకొన్నది. లోపలకు వెళ్లి ఇన్ని మంచి నీళ్లు తెచ్చి త్రాగమని ఇచ్చినది; త్రాగినాను. స్పృహబాగావచ్చిన తర్వాత ఆమె రు 1-0-0 తెచ్చి పుస్తకాలు కొనుక్కోమని నాచేతిలో పెట్టి పంపినది. రావిచెట్టు క్రిందికి చేరాను. తిరిగీ జిజ్ఞాసలో పడ్డాను. రిక్తుడను - అనమాన పరంపరలతో చదువు సాగించడం దుర్లభమని తోచింది. నాకూ, వ్యయసాధ్యమైన ఈ చదువుకూ దూరమని నిర్ణయించుకున్నాను. ఏదైనా నాకు తగిన ఉద్యోగంచేసి సంపాదించి పొట్టబోసుకుందాము అని యోచన కలిగింది.

ఏమి ఉద్యోగంచేతుమా అని ఆలోచింప నారంభించాను. ప్లీడరు గుమస్తాచేయుమని ఒకరు సలహా యిచ్చారు. ఒక వకీలుకు సిఫారసు చేసినారు. వారివద్ద గుమాస్తాగా చేరినాను. ఆవకీలు నెలపూర్తి అయితేగాని జీతమివ్వబడదు, పని నేర్చుకో అన్నారు. నా కప్పచెప్ప బడినపని-వకీలుగారి గౌను, ఇంతంత లావుపుస్తకాలు-ఎద్దుమోత నెత్తిన పెట్టుకొని హైకోర్టు మెట్లు ఎక్కడం, దిగడం. నెల అయిపోయింది. అన్నానికి ఇబ్బందిగా ఉన్నది; జీతం ఇవ్వండి అన్నాను. "మీరింకాపని నేర్చుకోనిదే; రెండుమూడు నెలలు నేర్చుకున్నాక-జీతం ఆలోచింతాము" అన్నారు. ఎన్నాళ్లు-గౌను లావుపుస్తకాలు నెత్తిన పెట్టుకుని మోస్తూ-హైకోర్టుమెట్లు ఎక్కే, దిగే విద్య నేర్చేదను-అని నాకు తోచింది. ఆదినంతో దానిని వదులుకొన్నాను.

అప్పుడే క్రొత్తగా 'ట్రాంబండి' వేసినారు. ట్రాంబండ్లలో కండక్టరుగా చేరుదా మని బుద్ధిపుట్టినది. దరఖాస్తు వేశాను-"ఖాళీలేదు" అని జబాబిచ్చారు. అది అట్లా తొలిగిపోయింది.

ఎవ్వరి సలహాలేకుండా నాలో నేను ఆలోచించుకో నారంభించాను. ఏదైనా ఉద్యోగం చేసే బ్రతకవలెను అనే నిశ్చయం ఇంకా దృఢపడ్డది. ఆ ఉద్యోగం, ఒకరి సలహా, సిఫారసు లేకుండా దొరకవలెను. అప్పటికీ ఇప్పటికీ-చెన్నపట్నంలో, రెండు ఉద్యోగాలు హెచ్చు విద్య అవసరంలేకుండా, ఏ సిఫారసు లేకుండా దొరికేవి,-ఉన్నవి-అందొకటి-బ్రోకర్ పని. దీనికి తలగుడ్డ, కోటు, వల్లెవాటు, చేతికర్రో, గొడుగో, చెప్పులు.

ఇట్లా కొంత వేషం, భేషజం ఉండవలె; మరొకటికూడా అవసరము; అది 'మద్రాసు పితలాటకం' అనేవిద్య, నా కా, ఆవిద్యా చేతకాదు; ఆ ఉడుపులు వేసుకొనే శక్తీలేదు. అదీమానుకున్నాను.

రెండవది : నాటు వైద్యం. ఆయుర్వేద వైద్య విద్యనేర్పే పాఠశాలలు ఆరోజుల్లో మద్రాసులో లేవు. ఆ వైద్యవిద్య తెలిసినవారివద్ద గురుకులవాసం చేసి నేర్వ వలసినదే. ఒక నంబిఆచార్లవద్ద, ఒక శాస్త్రిగ్లుగారివద్ద ఆవిద్యనేర్చినాను. ఆనంబి ఆచార్ల గారికి శాస్త్రము విశేషమేమీ తెలియదు. తాతముత్తాల నాటినుండి అనుశ్రుతంగావచ్చే వైద్యవృత్తిమాత్రం అవలంబించినారు. వారుచేసిన కుప్పెకట్లు కొన్ని వారివద్ద ఉన్నవి. వాటిసహాయంతో అనుభవంకొద్దీ ఆయన 'సంచికట్టు' వైద్యం సాగించేవారు. ఆయన నాకు నేర్ప గలిగిందేముంది? ఏదో ఇంతమందు కల్వంలోవేసి, ఇన్ని నిమ్మపండ్ల రసంపిండి మర్దన చేయమనేవారు. ఎంతకాలం అట్లామర్దనచేస్తే నాకు విద్య అంటుతుంది? ఆయనను వదిలిపెట్టినాను.

మహాదేవ శాస్త్రిగారు వైద్యశాస్త్రం తెలిసినవారు. వారివద్ద కొంతవరకు శాస్త్ర రీత్యావిద్య నేర్చినాను. వైద్యగ్రంథములు చదివి వైద్యరహస్యములు బోధపరుచుకున్నాను. కొన్ని మందులను తయారుచేసి, కోమట్లఇండ్లలో వైద్యంచేశేవాడను. శ్రీ పాలూరి రాజం శెట్టిగారు నీలిమందువర్తకం చేసేవారు. వర్తకులలో ప్రముఖులు, కన్యకాపరమేశ్వరీ దేవా లయపు ఆస్తికి-ట్రస్టీలలో ముఖ్యులు. సరిగా ఆకాలమందే వారు కన్యకా పరమేశ్వరీ ధర్మ ఆయుర్వేద వైద్యశాల అని యొకటి స్థాపించినారు. దానిలో శ్రీ పండిత డి. గోపాలాచార్యులుగారిని వైద్యులుగా నియమించినారు. శ్రీ రాజంచెట్టిగారికి నేను తరచుగా పుల్లటి మందులు చేస్తూ ఉండేవాడిని. వారు దానికని నాయందెంతో దయగా ఉండేవారు. ఆపరిచయంచేత వారు మిగత ట్రస్టీలకు సిఫారసుచేసి, నన్నుకూడా ఆకన్యకా పరమేశ్వరీ ట్రస్టు ధర్మాయుర్వేద వైద్యశాలలో-ఆచార్లగారికి సహాయ వైద్యు లుగా నియమింప చేశారు. నేనూ ఆచార్లగారూ కలిసి ఆవైద్యశాలలో-4 సం ॥ లు పని చేశాము. పిదప వారికీ నాకూ సరిపడలేదు. నేను ఆ ఉద్యోగానికి రాజీనామా నిచ్చి నాను. స్వయంగా, స్వతంత్రముగా 'వైద్యాలయం' ఏర్పాటు చేసుకొని-పెట్టుకోవాలని తలచినాను. ఆధర్మవైద్యశాల యుండిన నారాయణ ముదలివీధిలోనే-ఒక ఇల్లు నెల 1 కి రు. 1-6-0 ను బాడుగకు తీసుకొని-వైద్య మారంభించినాను. మందులు చేసుకోడానికి కాపురముండడానికీ అదేఇల్లు. ఈ నూతన యత్నారంభంచేసిన రోజుననే-ఆయింటి వీధి గోడమీద, బొగ్గుతో, పెద్దఅక్షరాలతో,

# "కేసరికుటీరం, ఆయుర్వేద ఔషధశాల"

అని వ్రాశాను. అదే నా అదృష్ట రేఖల ధరించిన మొదటి "సైన్‌బోర్డు" **(Sign Board.)**

అప్పటినుంచీ, ఇప్పటివరకు, ఈ వృత్తిలోకూడా నాకు చాలా కష్టములు కలిగి నప్పటికీ, వాటినన్నిటినీ జయించుకొని, కొన్ని సంవత్సరములుగా ఏ ఇబ్బందియులేక స్థిరపడి-ఇప్పటికి మీయెదుట ఈ విధిగా నిలువగల్గినాను. ఇదీ నా నిజవృత్తాంతము.

'ఇన్నికష్టములు పడిన్నీ 'చేసిన ఘనకార్యములేమిటి' అని మీరు నన్ను అడుగ వచ్చును. ఒక్కొక్కటిగా చెప్పెదను.

చిన్నతనంలో, ఇల్లువాకిలి లేనివానినిగాచేసి నన్ను రావిచెట్టు క్రింద కాపురము చేయించినందుకు-దేవునిమీద కోపంవచ్చి-నివసించడానికి మంచిభవనాన్ని నిర్మించుకున్నాను.

చిన్ననాడు విద్యకై పడినకష్టములు మరువజాలక ఈ విద్యాలయం స్థాపించినాను.

చదువుకొనునప్పుడు నన్నాదరించి నాకు అన్నముపెట్టిన అమ్మల అమృతహస్తములకు ఏటేటా, "గృహలక్ష్మి స్వర్ణకంకణము" అనేపేరుతో బంగారు తోడాలను తొడుగుతున్నాను.

ఇప్పుడు మరొక కార్యం చేయదలచుకొన్నాను. నన్ను ఈ స్థితికితెచ్చినది స్త్రీల ఆరోగ్యమునకై తయారుచేయ బడుచుండిన "లోధ్ర" అనే ఔషధరాజము. ఈ ఔషధమువల్ల నాకింత సంపాద్యము చేకూరినది. కావున ఈ ద్రవ్యాన్ని 'స్త్రీధనము'గా భావిస్తున్నాను. స్త్రీధనము పవిత్రమైనది. ఆధనంఅంతా దిగమ్రింగిన అజీర్ణముకలుగుననే భయముతో, ఈ దినం స్త్రీలవిద్యాభివృద్ధికై - లక్షరూపాయలను మా స్కూలు కమిటీ పరముగా ఇచ్చుచున్నాను. ఈధనం వెచ్చించి "కేసరీ కన్యావిద్యాలయం"అనేపేరుతో ఆడబిడ్డలకు ప్రత్యేకంగా ఒకవిద్యాలయం నెలకొల్పండి-అని ఈకమిటీ వారినికోరుచున్నాను.

"శ్లో. క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవిత మావయోః
యమస్య కరుణా నాస్తి ధర్మస్య త్వరితా గతిః."




కేసరి హైస్కూలు, మైలాపూరు.

19-4-47 న కేసరి హైస్కూలు వార్షికోత్సవము సందర్భమున తీయబడిన ఛాయా చిత్రము.



మధ్యనున్న పుష్ప మాలాలంకృతులు హైస్కూలు స్థాపకులు డా. కేసరిగారు; అధ్యక్షులు శొంఠి రామమూర్తి గారు.



# సైరంధ్రి

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు.



(జనవరి సంచిక తరువాయి)

ఎట్లొ యజ్ఞాతవాసంబు నెట్లొపోన సమయమును దీర్చికొనిపోయి సామవిధిని
దానవిధిని రాజ్య భాగంబు గోరుగాని ధర్మరాజని సేయంగఁ దలఁప డెప్పుడు.
అరయ రామలక్ష్మణులకన్న నలఘుమతులు ధర్మజుని తమ్ములనుట సత్యమ్మెనేని
అన్న కన్నను శౌర్య సంపన్నులయ్యు ఆజ్ఞ జవదాటగలరె భీమాదులిపుడు ?

ఏమను దానవా వగపు, నెవ్వరితోడ వచింపుదాన; నే
నేమని దూఱుదాన విధి; నేమని యీ వెతలన్ సహింతునో!
శ్రీమహిమాన్వితుల్ వినుత శీలురు శూరులు పాండుపుత్రులి
ట్లీమను జేతుజంటు లయి యెంత వలంతఁ గలంగు చుండిరో ?

కరి సహస్ర బలుండు గాంపు ప్రతాపుండు హరుని గెల్చు జోదు నరుండు పోర
గవలు నస్త్రవిదులుఁ గనుగొన్న గృష్ణుండు అహహా విధిని గెల్చు టలఘుతరము.

రాజాధి రాజయ్యు రాజ్యభోగంబుల ననుభవింపఁడు ధర్మతనయుఁడెప్పుడు;
కీచకాది ఖలుల గూల్చి మెఱుంగఁడు భీమసేనుఁడు మహా భీమబలుఁడు
ఎద్దానిని జేయుటే నిహరించి మెఱుంగఁడు దుర్జయుండగు వీరు డర్జునుండు
సుఖమనుమాటనే సుంత మెఱుంగరు మాద్రిసుతులు సుకుమార తనులు
భూరి భుజబల యుతులగు పుత్రులుండ పాండురాజత వానికి భార్యయయ్యు
కూర్మి మేనల్లుడే చక్రిగాగ్చు చుండ నుండు కుంతీ మహాదేవి దొరుల పంచ.

భీమసేనుని భుజబలమేమియయ్యె, అర్జునుని శౌర్యమేగొంది నణగిపోయె
చంద్రవంశపు రాజుల శౌర్యవహ్ని అకట చల్లారనేమొ నేటికిని జూడ.
శీతకరు వంశమనుట సుస్థిరమొనర్ప చల్లగా నూరుచుండెను శమన సుతుండు
అన్నమాటకు జవదాటలేక మిన్నకున్నారు తమ్ములేమిటి జయమ్ము.

హృదయ మందెడబాయక యెఱియు చున్న కౌరవుల పైని పగదీర్పఁగలుగుటెట్లు
చేరి దుశ్శాసనుని గుండె జీల్తునన్న భీము భీమప్రతిజ్ఞయు బెండువడునె ?

ధర్మము ధర్మమంచెపుడు ధర్మతనూజుడు యజ్ఞయాగస
త్కర్మలఁ జేయుచున్ గడపె కాలమునెల్ల వనాంత రమ్ములన్
నిర్మల చిత్తుడై నరుడు నిద్దుర బోవుచునున్న వాఁ డహో
శర్మము రాచవారలకు క్షాత్రమటంచుఁ దలంప రైరిగాఁ.

అలుకయె లేదో భీమునకు నైన విషాన్నముఁ బెట్టినందుకున్
తలఁపున లేదో లక్కయిలు దగ్ధమొనర్చిన కాళరాత్రియున్
కలఁగదొ నెమ్మనంబు కులకాంత పరాభవ మెంచి యైననే
దలఁచిన నామనం బిపుడు ధగ్గనమండెడి వారి చైదముల్.

ధర్మజుఁడు సంధికే పంపఁదలఁచెనేని మాధవుఁడె పోవు బదులు మాటాడ లేక
పోయెఁ బో యందు సుతునకు బుద్ధిసెప్పి సంధిపొసగంగఁ జేయునే యంధ నృపతి.

మాధవుపల్కులు మన్నింపరింతయు తులువ లాదుష్టచతుష్టయమ్ము;
జనకు డాతనిమాట జవదాట డొక్కింత; కురువృద్ధు లతనికిఁ గూర్చువారు ;
మామ యేవేళ దుర్మంత్ర మాదేశించు; కుడి భుజంబయి సూతుకొడుకు దనరు;
తలనిడు తనపంపు తమ్ముడు నిరతంబు; జనము లాతని సొమ్మదినెడివారు;
పాడిగాదంచు నిదిధర్మబాహ్య మనుచు పాండురాజతనూజుల పాలొసంగు
మియ్యకుండిన నెగ్గగు నయ్య యంచు వాని కట బుద్ధి సెప్పెడి వారలెవరు ?

పిడుగులు బడ్డరీతి నని భీము గదాహతిచే సుయోధనుం
డెడపక యేయు నర్జును శిలీముఖపంక్తుల సూతపుత్రుడున్
వెడలు సుభద్రసూను శరవేగమునన్ గురు వీరముఖ్యులున్
పుడమిని గూలు టెన్నడగు పొల్పుగ నాకనుదోయి చల్లగా.

సమయక కరిహయ బృందము
సమయక కురు వీరభటులు సమయక రాజుల్
సమయక గాంధారేయులు
సుముఖత పాండవులు పాలు చూతురెయెపుడున్.

(సశేషము.)

# నవోదయము

(గతసంచిక తరువాయి.)

శ్రీమతి మద్దూరి మీనాక్షమ్మగారు.

మానవులు సంఘజీవులు. ఒకరిమీద నొకరు ఆధారపడిగాని ప్రత్యేకముగా నొకరును మనఁజాలరు. మనసంఘజీవనము మతవిషయ ధర్మసూత్రములచే బంధింపబడి, ప్రతీవ్యక్తియును తానుమాటలాడు భాషలో, చేయు క్రియలో జోక్యము కలిగించుకొను ప్రతివిషయములో తనకు తెలియకుండగనే మతవిషయమును పొందుపఱచుచున్నాడు. కాని పాశ్చాత్యనాగరికతా ప్రభావమువలన మనసంఘదృక్కులు ఛిన్నములైనవి. మతవిషయములో చెఱిపినను పాశ్చాత్యనాగరికత సంఘవిషయములో కొన్నిమార్పులను అభ్యుదయమైనవి సమకూర్చిపెట్టినది. ముఖ్యముగా సంఘములోని నూతన సంస్కరణలు, రాజారామమోహనరాయలుచే సతియు, శారదాచట్టమువలన అతిబాల్యవివాహములు, వీరేశలింగము మొదలగు ప్రభృతులచే వితంతువివాహ నిరసనము మొదలగునవి చాలవఱకు మాన్పబడినవి. గాంధిదేవుని దయచే హరిజనోద్ధరణ, అస్పృశ్యతా నివారణకూడ కలుగుచున్నది. కాని అసలు సంఘ సంస్కరణమనియెడిది స్త్రీలపైననే ఆధారపడియున్నది. స్త్రీలుసమ్మతించిననాడు ఏసంస్కరణమూ జరుగక నిలవదు. అప్పుడు ధర్మశాస్త్రము లేవియును అడ్డంకులుగా నుండవు. మూఢనమ్మకములకు పూర్వాచారములకు మహిళలే ఆధారభూతులని చాలమందినమ్మకము. కాని దీని ననుసరించి పాశ్చాత్యుల ననుకరణ చేయుట పొరపాటు. భారతీయ సంస్కృతి యంతయు మతధర్మములపై నాధారపడి యున్నది. కాని వానిలో కొన్ని యేకారణములచే నేర్పరుపఁజేసిరో మాత్రము నిగూఢమై యున్నది. అందుచే ప్రతివారును, తీవ్రముగా నాలోచనచేసి, చక్కగా విషయము నామూలాగ్రము పరిశీలనముచేసి, మంచిదని తోచినచో ప్రతిపనినిచేయ సమకట్ట వలయును. భారతీయుల ఆచారము ననుసరించియుండు జుట్టు, కట్టు, బొట్టు మొదలగునవి చాల ఆరోగ్య దాయకములు, మంచివి అనిచాలమంది శాస్త్రజ్ఞులు నుడువుచున్నారు. కానస్త్రీలందఱు ముఖ్యముగా విషయముల నాలోచించి సంఘశ్రేయస్సును చూచి ప్రతిదానిని చేయుట ఆదర్శకముగా నుంచుకొనుట కర్తవ్యమైయున్నది. తరువాత స్త్రీల గృహకృత్యము, దానిమీద ఆధారపడు సంఘమును విచారించ వలయును. ఒకరిమనస్సుల నొకరు అర్థముచేసుకొని ప్రయత్నించుట మూలమున ప్రశాంతత ఆవరించి మనోరంజకముగా గృహము తయారగును. దీనిమూలమున ఎన్నికుటుంబములనో పునరుద్ధరింపవచ్చును. అత్తమనస్సు కోడలు, కోడలమనస్సు అత్తయును గ్రహించి పనులు చేసుకొనుచుండిన ఆయింటిలో నుండు శాంతి వర్ణింప నలవిగాదుగదా! తరువాత గృహిణికార్యభారమును విలోకించవలెను. సమయమునకు అన్ని పనులు సక్రమముగ నెఱవేర్చి, గృహమును పరిశుభ్రముగా నుంచి ఇల్లుకళకళలాడు నట్లుంచి, పిల్లలను ఆరోగ్య శాస్త్రప్రకారము పెంచుచుండిన గృహిణికి, ఆయిల్లే స్వర్గసీమగా మారుననుటలో సంశయ మిసుమంతయులేదు. వీరినిచూచి తక్కిన సంఘమంతయు నేర్చుకొని దేశములో శాంతిని నెలకొలుపుదురు. ఈపరిణామమును బాలబాలికలందు కల్పించుటకు మాతృమూలముగ మిక్కిలి సులభము. శివాజీ, జిజియాభాయి కథను విననివారు అరుదు. జాతినిర్మాతలు తల్లులే. తల్లిప్రభావము బాలుని సున్నిత హృదయముపైన త్వరగా కనపఱచును. ఒకమంచితల్లి తనకుమారుని గాంధి వంటి

హానినిగా చేసినచో అతని మూలమున దేశమునంతను ఉచ్ఛస్థితికి తీసుకొని రావచ్చునుగదా! కాన క్రమమైన శిక్షణ యిచ్చుటకై తల్లి శీలముయొక్క ప్రాముఖ్యతను, ఆక్రమశిక్షణను, ఆరోగ్యమార్గములను గుర్తెరుగవలసి యున్నది. కావున స్త్రీజాతి యంతయు తమ కుమారులను, కుమార్తెలను భావినాయకులుగా తయారుచేయు శిక్షణ యిచ్చుటయందు నిమగ్నులయిన, దేశము ఉచ్ఛస్థితికి వచ్చుననుట నిర్వివాదాంశము.

దేశము యొక్క నాగరకత యెప్పుడును విద్యావిషయము మీద నాధారపడి యుండును. "విద్యా విహీనః పశుః సమానః" అని పెద్దలనే అన్నారు. పైచెప్పఁబడిన విషయములు చేయుటకు విద్యయే మూల ద్రవ్యము. విద్యావంతురాలుగాని స్త్రీ యేపనియును చేయఁజాలదు. భారతీయ సంస్కృతి ప్రాధాన్యము వహించవలయునన్న స్త్రీలకు విద్యనిప్పించుట అవసరము. మనదేశములో నేడు పురుషులలోనే పెక్కురు విద్యావిహీనులు కలరు. అప్పుడు స్త్రీలసంగతి చెప్పనవసరమేమున్నది! కాంగ్రెసు ప్రభుత్వము వచ్చుచుంటమిచే విద్యా విహీనత్వమునుండి విముక్తినొందెదమన్న ధైర్యము కలుగుచున్నది. అయినను నేడుగల విద్యావంతులైన స్త్రీలందరు, తక్కిన స్త్రీలకు విద్యయొక్క ప్రాముఖ్యము బోధించి, తమకుమార్తెలకు కుమారులకు గూడ విద్యయందాశక్తిగల వారినిగాచేయుటకర్తవ్యమై యున్నది. ముఖ్యముగా ఈకార్యమును గ్రామములలో పూర్వాచారములు పట్టుకొని ప్రేలాడువారియెడ చేయవలసి యున్నది. విద్య స్త్రీలకనవసరమనియెడువారు ఈకాలములో అరుదు. అప్పుడు ప్రజల అభిప్రాయములు అనేకవిషయములలో అందులో స్త్రీల విషయములో చాలభాగము మలుగుపొందినవి. అందుచే దీనిని చేయుతగా చేసుకొని స్త్రీలు అభ్యుదయ పంథాలో నడుపవలసి యుండును.

మనవిద్యలోగూడ చాలమార్పు వచ్చినది. ఇంకను చాలవరకు రావలెను. పాశ్చాత్యగ్రంథములలోని మంచిని గ్రహించి, మనవారితో జోడించి ఒక అభ్యుదయ మార్గమున నడువవలయును. తాముచదివిన విషయములు ఒకరికి చెప్పిగాని, లేక పత్రికమూలమున అందరికి అందుబాటులో నుంచునట్లుగాను చేయవలయును. స్త్రీలే భావివీరులకు, భావినాయకులకు కారణభూతులు కనుక విద్య వారికి ముఖ్యమైనది. భారతదేశము ఎన్నియో కళల విరాజిల్లియుండినది. కానినేడు అవిమచ్చునకైనను సరిగ కన్పడుటలేదు. త్యాగరాజు ఆంధ్రుడు. కాని ఆంధ్రులలో అతని ప్రతిభ తమిళ సోదరుల యందున్నంత కన్పడుటలేదు. సంగీతమునకు అనువగు స్థానము భగవంతుడు స్త్రీజాతిలో సృజించినాడు. కాన వారు ముఖ్యముగా సంగీతము, నృత్యము మొదలగు లలితకళలకు తమకు సాధ్యమైనంత సహాయము చేయుటకు నడుము కట్టుకొనవలయును. వీటికొరకు మహిళాసంఘము లేర్పడియున్నవి. కాని అవియైనను అంతగా అభివృద్ధి నొందుటలేదు. నాటకముల మూలమున, ఉపన్యాసముల మూలమున, గానసభలమూలమున, పోటీలమూలమున, భారతీయ సంస్కృతికి మరల జీవముపోయుట ఎక్కువ భాగ్యము స్త్రీల యందేయున్నది. ప్రతివస్తువులోను రమణీయతను కుంపొందింపజేయుటకు స్త్రీప్రయత్నించవలయును. ముఖ్యముగా తమకుకావలసినవి పాఠశాలలు, కళాశాలలు, వైద్యశాలలు అన్నియు ప్రభుత్వముతో పోరాడియైనను సమకూర్చుకొనుటకు స్త్రీలు తమ సంఘములద్వారా శ్రద్ధవహించాలి. స్త్రీకి భూదేవికుండిన యంత ఓర్పు కలదందురు. అందుచే సహనముచే ప్రతివారి మనము చూరగొనుచు తమశక్తియుక్తులను వినియోగించి, తాముసేర్చినది, కూర్చినది స్వగృహములో

ప్రథమమున ఆచరణ యందుంచి, తరువాత సంఘముల ద్వారా దేశశ్రేయస్సుకై యత్నించుట సర్వదా శ్రేయమైనకార్యము. ముఖ్యముగావారు గ్రామపునరుద్ధరణకై గ్రామములో ప్రజలకు విద్యాబోధనము గావించిన దానిమూలమున కలిగెడు ఫలితము చాలకీర్తింపదగినది.

రాజకీయముగా స్త్రీలు విద్యావంతులైననే దేశమున కుపయోగపడగలరు. విజయలక్ష్మిపండిట్ మొదలగువారు అంతదేశసేవ చేస్తున్నారంటే వారివిద్యాకారణముగాని మరింకేమియులేదు. పైనచెప్పినకార్యముల యందు కృతకృత్యులైన, అదియే నిజమగు దేశసేవ. అంతకుమించి మరి యొకటి యుండబోదు. కాన స్త్రీలందఱు తమకు అందుబాటులోనున్నది తమకును, దేశమునకును మేలు కలుగజేయునవి సర్వదా నాచరణయందుంచుట శ్రేయస్కరము.

విద్యయుండినగాని స్త్రీలకుగాని పురుషులకుగాని సద్గుణములు యబ్బవు. సద్గుణములు యబ్బినగాని మితవ్యయము యలవడదు. మితవ్యయము యలవడినగాని సంసారములు, సంఘదృష్ట్యా లోకదృష్ట్యా బాగుపడి, పురుషులు స్త్రీలు సుఖముగా కాలముగడుపుటకు వీలుపడదు. పురుషులు స్త్రీలు సుఖముగ నుండినగాని దేశమునకు క్షేమముకలుగదు. దేశమునకు క్షేమము కలుగవలయుననిన, స్త్రీలు సృష్టికి మూలాధారములగుటచే తమశక్తిని ధారబోయ వలయును. సమయము చిక్కదని కొందరందురు. అదియంతయు గృహనిర్వహణశక్తిని బట్టియుండును. స్త్రీలు గృహమెంతచక్కగా దిద్దిన, దేశమును గూడ అంతబాగుగా సరిచేయగలరు. కావున మహిళలందఱు తమగృహములను తొలుత అభివృద్ధిచేసికొని, తమసంఘముల ద్వారా దేశక్షేమమునకు గూడ ప్రయత్నించవలసి యున్నది. పురుషులను గూర్చియాలోచించక, స్త్రీలుపైనచెప్పినది తమకార్యముగ నెంచుకొనిననే నిజముగా దేశమునకు ముక్తికలుగును. వీటన్నిటికి వివేకము, పట్టుదల, నిర్ణీత కాల కార్యాచరణము ఇవి ముఖ్యముగా అవసరమైనవి.

ఇట్లుతమకర్తవ్యమును నెరవేర్చుకొనుటయేకళ. కళయనగా లక్ష్మి. అదిదేశమునకు వచ్చినప్పుడే మన భారతమాత 'భారతభాగ్యలక్ష్మి' అనిపించుకొనును. స్త్రీ గృహమునకు గృహలక్ష్మి. ఆమెమూలమున ఇల్లు కళలతో విరాజిల్లుట అటువంటి గృహముల సముదాయముచే దేశము గూడ స్వర్ణప్రభాత భానోదయము మాదిరి వెలుగొందుట ప్రారంభించినపుడే నవోదయమగును. ఇప్పుడే మఱల మన 'గృహలక్ష్మి' వచ్చినది. తన కృతకృత్యము నెరవేర్చుకొని నవోదయమునకు మార్గదర్శకమవునని తలంచెదముగాక.








# బాబ్జీలు

(మా అబ్బాయికి ముద్దుపేరు)

రచనః- కొనకళ్ల వెంకటరత్నం, ఏలూరు.




తినకండానే
తీపులు పూరే
తియ్యని ఫలమిది బాబ్జీలు;
నందన వనతరు
సుందర శాఖల
కిందికి రాలెను మావొడిలో.

* * *

నీటగు మోమున
నిగ్గులు తరగని
నెలబాలుడు మా బాబ్జీలు.
మబ్బులు విడిచీ,
నిద్దర కోసము
మరచి పరున్నా డుయ్యేలలో.

* * *

నీడలు మసలని,
నిల్కడ చెదరని,
నిశ్చల దీపము బాబ్జీలు.
పున్నమి రాత్రి
ళ్లన్నివొకటై,
బొత్తిళ్లలో మెయివాల్చెనావో !






# వైవాహికాచారములు.

★

శ్రీమతి వల్లూరుపల్లి వెంకటరత్న మణీబాయిగారు.



నేడు మనదేశములో సాంఘిక దురాచారముల సమితిలో వరకట్నాలకు గూడ ఒక సభ్యత్వము గలదు. స్త్రీజాతికిగల అభివృద్ధి నిరోధకశక్తులలో ఈవరకట్నాలు ప్రప్రథమ స్థానము ఆక్రమించినవి. ఉన్నతభావాలు, ఉన్నతాశయాలుకల్గి, నవీన నాగరికతకు అలవాటైన నేటి స్త్రీపురుషుల వివాహములకు ఈవరకట్నాలు పనికిరావు. ఒక్కొక్కప్పుడు వివాహాలలో వధూవరులకన్న ధనమునకే ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చుచున్నారనుటలో అతిశయోక్తి ఏమాత్రములేదు.

ఈవరకట్నాలలో కొన్నిదశలు గలవు. గతసంచికలో శ్రీమతి ఆచంట రత్నకుమారిగారు వ్రాసినది ఒకదశకు సంబంధించినది. చదువులేకపోయినప్పటికి ఎకరము పొలమువుంటే వేయిరూపాయలు ఇమ్మంటున్నారు. ఒకమాదిరిచదువుండి, కొలది ఆస్తిమాత్రమువుంటే పదినుండి పదిహేనువేలవరకు బేరము. పెద్దచదువు (ఏడాక్టరో, ఏయింజనీరో మొదలగునవి) వుండి, ఆస్తిఏమియూలేకపోతే, 20 నుండి 30 వేలవరకు కట్నాలు ఇస్తామని కాళ్లమీద పడతారు పిల్లతరఫువారు. సంతబజారులలో పశువులను వేలమువేసినట్లు, కట్నముల బజారులో యువకులను తమ తల్లిదండ్రులు వేలము వేయుచున్నారంటే, సదరు తల్లిదండ్రులను ఏమనవచ్చును? ఏమిచేయవలయును? అంతకన్నా నీచాతినీచమైన పని మరొకటి గలదా?

ఈవిశాలమైన ప్రపంచములో తుచ్ఛమయిన, నీచమయిన, కట్నములకు ఆశపడని వారుండకపోవుటచే ఎందరో తలిదండ్రులు తమకుమార్తెలకు వివాహములు చేయలేక పోవుచున్నారు. దాని ఫలితముగా యుక్తవయస్సు దాటినప్పటికి, అవివాహితులయిన స్త్రీలను మనము ఎంతమందిని చూడలేదు?

యుక్తవయస్సు దాటినప్పటికి కట్నము ఇవ్వగలిగినంత తాహతు లేకపోవుటచే, పెండ్లికాని ఆడపిల్లలగల కుటుంబము ఏదైనా ఒకటుంటే, అనేకమంది ఆడ, మొగ, అనేక విధములుగా ఆకుటుంబాన్ని ఆడిపోసుకుంటారేకాని, అసలు విషయము గ్రహించరు. హిందూధర్మశాస్త్రప్రకారము స్త్రీలకు నియమితకాలములో వివాహములు చేయకుండా ఇంట్లో పెట్టుకున్నారని బూజుపట్టిన శాస్త్రపరాయణులు నిందిస్తారు. అంతేగాక, సదరు కుటుంబములను లేనిపోని నిందలకు గురిచేస్తారు. ఈ కపట సంఘసంస్కర్తల నీలాప నిందలు పడలేక, కుమార్తెలతోపాటు ఆత్మహత్య చేసుకున్న తల్లిదండ్రులకు ఈ ప్రపంచములో స్థానము లేకపోలేదు.

ఈ 20 వ శతాబ్దములో కూడా ఈ వరకట్నాలు ప్రబలియుండటానికి కారణమేమి? వున్నవాడు వున్నవాడికే పెడ్తాడు, లేనివాడు వున్నవాడికే పెడ్తాడు. ఎప్పుడైతే వున్నవాడు వున్నవాడి ప్రక్కన జేరటంమానునో, అప్పుడే లేనివాడుకూడ వున్నవాడి ప్రక్కనజేరటం మానును, లేదా, ఎప్పుడైతే లేనివాడు వున్నవాడి ప్రక్కన జేరటంమానునో, అప్పుడే వున్నవాడు కూడ వున్నవాని ప్రక్కన జేరటం మానును.

ఈ వరకట్నాలను నిర్మూలించటానికి చట్టము ఒకదానిని తయారుజేసి, అమలులో పెట్టుటకు కృషిచేయుచున్న ప్రజాప్రభుత్వమును మన స్త్రీజాతి తరఫున అభినందించు చున్నాను. సాంఘిక చిత్రములు ఎన్నియో తయారుజేసిరి. కాని, వరకట్నాలు సమసి పోవాలనే నీతిని బోధించేచిత్రాలు (వరవిక్రయము మొదలగునవి ఒకటో, రెండు మినహా) ఇంతవరకు ఏమీ తయారు చేయలేకుండుటకు మన దర్శక మహాశయులకు తెలివితక్కువగాదా? ఇకనైన తయారుచేస్తారని ఆసించవచ్చునా?

ఈ వరకట్నాలు మొదలగు సాంఘిక దురాచారముల వలన, ఎన్ని పెద్ద కుటుంబాలు బీదస్థితికి వచ్చుచున్నవో, ఎన్ని బీదకుటుంబాలు ఆహుతి అగుచున్నవో, ప్రేమ వివాహాలు ఎన్ని ఆగిపోవుచున్నవో, ఎన్ని జీవులు బలి అగుచున్నవో, 'సంస్కర్తలు' అని పిలువబడే ఓ దొంగ పెద్దమనుష్యులారా! మీరెప్పుడైనా ఆలోచించారా?

ధనాశాపరులై, రేపో మాపో చచ్చుటకు సిద్ధముగానున్న కడు వృద్ధులకు నవ యవ్వనము పైకి ఉప్పొంగుచున్న తమ కుమార్తెలను ఇచ్చి పెండ్లిళ్లుచేసి వారి జీవితము లను నాశనము చేసిన దల్లిదండ్రులను రోజూ ఎంతమందిని మనము చూచుటలేదు? దాని ఫలితముగా ఆయువతులు కుమిలి కుమిలి ఎంతదుఃఖించుచున్నారో మీ రెప్పుడైనా ఆలకించారా? చచ్చుటకు సిద్ధముగానున్న తనవారి కడసారి కోర్కెలను తీర్చటానికై తమకు యిష్టములేని వివాహములు చేసుకొని సంసార సాగరములో తమ దాంపత్య నౌకను సాఫీగా నడుప లేక, భగ్నజీవులయిన దంపతులు ఎందరున్నారో మీరెపుడైనా లెఖ్ఖించినారా?

ఏనాడైతే మన దేశములోగల ఈ వైవాహికాచారములు సమసిపోవునో, ఆనాడే మన దేశానికి మోక్షము కలుగును అంటే నమ్మండి.

స్త్రీలను భార్యలుగా ఎన్నుకొనుటలో పురుషులుగాని, పురుషులను భర్తలుగా ఎన్నుకొనుటలో స్త్రీలుగాని, వారి యిష్టాయిష్టముల ప్రకారము వారికి నచ్చినవారిని ఎన్నుకోవలయునుగాని, తమ తల్లిదండ్రులను జోక్యము కలుగజేసుకో నీయకూడదని తమ కుమారుల కుమార్తెల వివాహములు చేయుటలో, తల్లిదండ్రులు వారికి హితబోధచేసే వారుగా నుండవలయునేగాని, వారిపైన తమకున్న సంపూర్ణ అధికారమును చెలాయించ గూడదని నేనంటాను. పాఠకులారా మీ రేమంటారు?

# ఆత్మబలి

'దీదీ' అనే హిందీ పత్రికలో శ్రీ సురేంద్రశర్మగారు వ్రాసిన
గాథ కిది అనువాదము.

శ్రీ వేముగంటి అనంతరావుగారు.

ప్రస్తుతము హిందూసమాజములో ఆచారముగా పరిగణింపబడు అత్యాచారములలో వరకట్నము ప్రాముఖ్యమైనదని చెప్పవచ్చు. ఈ వరకట్నపు టవమానముల భరింపలేక, ఆత్మగౌరవమును నిలుపుకొనుటకై, ఆత్మహత్య గావించుకొన్న స్వర్గీయ వేదకుమారియొక్క విషాదగాథ విని కంటనీరుపెట్టని సహృదయు లుండరు.

శ్రీమతి వేదకుమారి 1929 లో జన్మించినది. ఆమె తండ్రి డాక్టరు మాతాదీనగుప్త ప్రస్తుతము బెల్గాములో గవర్నమెంటు డాక్టరుగా వున్నారు. వేదకుమారి చిన్నప్పటి నుంచీ కూడా ఆత్మగౌరవము విషయములో యెక్కువ శ్రద్ధకలిగి వుండేది. ఆమె తన పదహారవ సంవత్సరంలో మెట్రిక్యులేషను ప్యాసయింది.

ఆమరుసటి సంవత్సరమే ఆమెతండ్రి ఆమె వివాహమును ఫిరోజా బాద్‌పట్టణములోని లాలా రాజగోపాల్‌గారి కుమారుడైన వ్రజేంద్రసింహగుప్త, యం.యస్.సి.గారితో ముజఫర్‌పూర్‌లో జరిగింది. ఆయన యిప్పుడు ముజఫర్‌పూర్ డి. యే. బి. కాలేజీలో ప్రొఫెసర్‌గావున్నారు.

లాలారాజగోపాల్‌గారు పేరెన్నిక గన్న ధనవంతుడు. పరమలోభి. తనపుత్రుని వివాహ సంధర్భములో వచ్చినంతసొమ్ము రాబట్టుకొనుటకు ఆయన నిశ్చయించుకున్నాడు. వేదకుమారి తండ్రి 3,500 రూపాయలు కట్నముగా నిచ్చుటకు అంగీకరించాడు. ఆయన కూడ ధనవంతు డవడంవలన పైగా యింకా వస్తురూపంలో కొంతడబ్బు ముట్టజెప్పగలరనే దురభిప్రాయంతో లాలా రాజగోపాల్‌గారు ఈసంబంధానికి వప్పుకున్నారు!

కాని, ఆయన అనుకున్నట్టుగా జరుగలేదు! వివాహము జరిగిపోయింది. వేదకుమారి ప్రప్రథమంగా అత్తవారింటిలో కాలుపెట్టింది. అప్పటి నుంచి ఆమెకు చెడురోజులు

దాపురించాయి! ఆమె ఒక్కనెలమాత్రం అక్కడవుంది. ఆనెలరోజులలోను అత్తవారింట ఆమె అనేక అవమానాల్ని పొందింది. అత్తగారియొక్క, మామగారియొక్క వ్యంగ్యపూరిత కఠోర వాగ్బాణాలచేత ఆమెహృదయం చిల్లులుపడి పోయింది. పెళ్లిలోయిచ్చిన "ముష్టి కట్నం" తప్ప, పైగా యింకేమీ ముట్టచెప్పలేదనీ, పెండ్లిలో తగినంత మర్యాద చేయలేదనీ ఆయింట్లోనివారంతా ఆమెను హేళనగాచూస్తూ తూలనాడేవారు! అధమం ఒక్క మోటారు, రేడియోసెట్టు అయినా పుట్టింటినుంచి తీసుకువచ్చేదాకా ఆమెగతి యింతేనని అత్తగారు నిష్కర్షగా చెప్పింది. ఇదంతా చూడగానే వేదకుమారికి జీవితమంటే విరక్తి కలిగింది. భర్తయొక్క అవ్యక్తత, నిష్ఠురత, అత్తమామలు ఆత్మగౌరవం వదలుకొని పరధనానికై యితరుల నాదేశించే విధానం, యింటిలోని యితర బంధువుల విముఖత యివన్నీ ఆమెకు జీవితమంటే విరక్తి కలుగచేశాయి. తాను జీవించడంవలన తనకుగాని, తనవారికిగాని గౌరవములేదని ఆమె గ్రహించింది! ఆత్మగౌరవము పోగొట్టుకొని జీవచ్ఛవమువలె జీవించుటకంటె, ఆత్మహత్యచేసుకొని తనగౌరవం కాపాడుకోవడం వుత్తమమని ఆమె భావించినది!

ఇంతలో ఆమెను పుట్టింటికి తీసుకువెళ్లడానికి ఆమె అన్న అక్కడకువచ్చాడు. ఆయనకూడ ఆయింటివారిచేత అవమానింపబడి దూషింప బడ్డాడు! మామగారు వేద కుమారి నగలన్నీ తీసుకొని ఆమెను కట్టు గుడ్డలతో పుట్టింటికి పంపించారు. ఈ అవమానాన్ని ఆమెభరించలేకపోయింది. పుట్టింటినుంచి వచ్చేటప్పుడు ఆమె తనతండ్రి రివాల్వరును గుప్తంగా తనతో తెచ్చుకొంది.

వేదకుమారి రెండవసారి అత్తవారింటికి వచ్చినప్పుడు పరిస్థితులు మరీవిషమించాయి. వారుకోరిన మోటారు, రేడియో తీసుకురానందుకుగాను ఆయింటివారు ఆమెను అనేక విధాలుగా బాధపెట్టారు. ఆమె యింక సహించలేకపోయింది. తనతల్లితండ్రులకీపరిస్థితి అంతా విశదపరుస్తూ తనకడసారి వుత్తరమువ్రాసి, 26-11-46 వ తారీఖున వేదకుమారి తనతండ్రిరివాల్వరుతో పేల్చుకొని ఆత్మహత్య చేసుకుంది! ఆమె తన పదిహేడవసంవత్సరం లోనే నూరేళ్లూనిండించు కొంది !!............

...... నేడు దేశములోవున్న ప్రముఖనాయకులు, సంఘసంస్కర్తలు, మానవ సేవాభిలాషులు యీవరకట్నపు అత్యాచారాలు, వాని పరిణామాలు ,అరికట్టుటకు యిక

ముందైనా అమితమైనశ్రద్ధతోను, పట్టుదలతోను చేస్తేనేగాని, సర్వమానవసౌభ్రాతృత్వం, స్త్రీపురుష సమానాధికారం హృదయ పరివర్తనలతో వ్యాపిస్తున్న యీప్రస్తుత సంధికాలంలో ఆత్మగౌరవార్థము ఆత్మబలి నర్పించే వేదకుమారివంటి యువతులసంఖ్య యెక్కువగుతుందనడం నిర్వివాదాంశం. ఈఅత్యాచారాల్ని అరికట్టుటకు ముఖ్యముగా సోదరీమణులు కూడ తీవ్రకృషి సల్పిననాడే పవిత్రమైన వేదకుమారియొక్క ఆత్మకు శాంతికలుగుతుంది!



# చిత్రప్రశ్నలు.

**శ్రీమతి ముడుంబ వెంకటమ్మగారు.**

## మొదటి ప్రశ్న

సీ॥ తొలకరికొప్డు బయలుదేరునదియొద్ది? పసిపాపలకు నాటవస్తువేది?
ప్రాయుట కుపయోగపడు వస్తు వెయ్యది? నేత్రకంటకముగా నేర్చునేది?
వత్సరనామమై వరలు చుండునదేది? చిలురాలజాతికిఁ జెందునేది?
నేయుట కొకరీతి నెగడు చుండునదేది? పండితుశిరముపై నుండునెద్ది?

గీ౹ అన్నిఁటి జవాబు మూడేసి యక్కరములె;
రెండుమూడును "ల" "క" లయి యుండవలయు;
దయను ప్రశ్నాష్టకమునకుఁ దగు జవాబు
పడుతులే గృహలక్ష్మికిఁ బంపవలయు.

## రెండవ ప్రశ్న

గీ౹ అత్తగారును, కోడలు, నాడుబిడ్డ;
వదిన, తల్లియు, గూతురుఁ బోదలునింట
నందరకుఁ ద్రుంచకుండ మూడరిసెలెట్లు
పంచవచ్చునో తెల్పుడీ, పడుఁతులార!

(ఈ చిత్రప్రశ్నలకు జబాబులు పంపడంలో పడతులందరూ పాల్గొనవచ్చును. మే 15 వ తేదీ లోపుగా జవాబులు మాకుచేరాలి. గృ॥ సం॥)

# నాగరాణి

శ్రీమతి సామవేదుల చిరంజీవిగారు

[యౌవనారంభమున ఖయిదుసబడిన నాగరాణి 'గిడల్లో' పదుమూడేండ్లు జైలులో గడిపి 1945 సెప్టెంబరులో విముక్తయైనది. విడివడియు స్వతంత్రజీవనములేదు. చేతులార మాతృసేవల జేయుట కనుజ్ఞలేదు. ప్రస్తుతమామె గారోకొండలలో స్వగృహమున నిర్బంధితయైయున్నది. మనోవేదనచే చిత్తభ్రమణము కలుగు సూచనల జూపుచున్నదని వార్త! ఆమె సత్వరముక్తికై కేంద్రప్రభుత్వమునకు నివేదించబడినది.]

తొల్లి భూమిజ రామునితోడ వనుల
వానియాసల ద్వీపాంత్ర వాసముడిపె!
తోడు నీడలులేక బంధుర నిబంధ
శాల గడపెను, సమవేళ, నాగరాణి!

మిసిమి యౌవనమున జైలుముసుగున బడి
పదియు మూడేండ్లు చివికిన ప్రాయమునకు
తల నెరసి పోయెనో గుండె తరుగుకొనెనో
కిక్కురన దింత విడివడ్డ గిడలూ నేడు.

ఇంతనిడుపైన కాలమ్ము నిరులుగ్రమ్మ
ఖయిదు గోడల రాళ్లతో గడపె పొత్తు!
మంతనము లేమి చెప్పెనో యంతకన్న
కఠిన చిత్తులతో జైలు కాపరులతో!!

నాల్గుగోడల యినుపబందాల ఖైదు
విడిచి పడియెను నలుదిక్కు విడిఖయిదున,
మాట పలుకగరాని చే మలప లేని
బొంది యను బందిఖాన యపూర్వ మహహా!

మిసిమి యౌవన ముడివోవ విసుగలేదు;
తనువు కృశియింపులకు నుంత కినియలేదు;
దేశమాతకు సేవలు దీటుకొనగ
చేయజాలమి కెంతగా చింతగనెనో!

నాటియుదయాహ్నమున, కాలినడక, మడమ
లంటు నల్లనిచీర శిరోవరణము
కలిగి పలుచని తనువల్లి కనల, చొచ్చె
రైలులో థర్డ్క్లాసున రాణి గిడలూ!

విజయ గీతము లింజను వెగటుకూత
స్వాగతముక్రింది తరగతి బల్లపయికి
పార్శ్వచారులు పోలీసు పాశధారు
లబల! నేరము—దేశసేవాభిలాష!

మరువలేదామె నొక్కింత మాతృభక్తి
రక్తనాళాల ప్రవహించు ప్రజలు నేడు!
మరువలేరామె బలిదాన మహితచరిత
ముందు యుగముల యువజనములు తుదకును!

ఏప్రజాస్వేచ్ఛకై పోరి యింత పడెనో
వారలేమియు చేయగా వశముకాదు,
ప్రజలమధ్యను దానుండి పలుకదామె
ఈ విచిత్రపు ఖయిదింక యెన్నినాళ్లో!

రాకమానద ఈలోన ప్రజలు విజయ
భేరి మ్రోయించి నగరాణి నూర నూర
నుత్సవమ్ముల స్వాగతోద్యోగములను
తెచ్చివెలయించు శుభమైన దినము త్వరగ!

# అశ్రుతర్పణం

★ ★ ★ ★

శ్రీ ఎన్. వి. ఆర్. కృష్ణమాచార్యులుగారు.



"లే నాన్నా, నీవీవాళ తలంటుపోసుకోవాలి" అంటూ ప్రొద్దున్నే లేవగానే రామాన్ని తల్లి బ్రతిమాలుకోవటం మొదలుపెట్టింది.

"ఇప్పుడు తలంటు ఎందుకే అమ్మా?" అంటూ రామం తల్లిని ప్రశ్నించాడు.

"ఈరోజు నీవు పుట్టిన రోజు; తలంటు పోసుకొని క్రొత్తచొక్కా లాగు తొడుక్కొని, ఆడుకుందువుగాని."

"అమ్మా! ఈవాళ పుట్టినరోజేమిటే? నేనుపుట్టి చాలరోజులు కాలేదే?"

"వెఱ్ఱితండ్రీ, నువ్వు పుట్టి చాలా రోజులయిందిలే; పుట్టినరోజు ఏడాదికి ఒకసారి వస్తూంటుంది. ఆరోజున మనం పండుగ చేసుకొంటాము."

"అమ్మా, నేనుపుట్టకపూర్వం ఎక్కడవున్నానే?"

ఆప్రశ్నకు సమాధానం ఏంచెప్పాలో తోచక, నవ్వి తల్లి రామాన్ని ముద్దుపెట్టుకొన్నది. ఆమెమరదలు శాంత ప్రక్కన వచ్చి నిల్చుండుట చూచి "శాంతా, చూశావా మామేనల్లుడికి ఎల్లాంటి ఊహలో?" అంటూ, రామంతో "నాన్నా తలంటుపోసుకో తర్వాత చెప్తానులే" అంది.

"చెప్పితేకాని పోసుకో" నన్నాడు రామం.

"చూశావా, శాంతా! వీడి మంకు పట్టు, అన్నీతండ్రిగుణాలు పుణికి పుచ్చుకున్నట్టు వచ్చాయి." అంటూండగా, శాంత వదినిగారిమాటలు అందిపుచ్చుకొని "అనవసరంగా తండ్రిని దెప్పకపోతే బాబుకు సమాధానం చెప్పరాదు?" అని రామంకేసి తిరిగి "బాబూ, నువ్వుపుట్టక పూర్వం అమ్మకడుపులో ఉన్నావు. తెలిసిందా? ఇంక స్నానంచెయ్యి" అంది. కాని రామం అంతమాత్రంతో తృప్తిపడేవాడు కాడు. వెంటనే "అత్తయ్యా, అమ్మకడుపు చిన్నదిగా, నేను అందులో ఎల్లాపట్టాను." అని తిరిగి ప్రశ్నించాడు. శాంత రామాన్ని ముద్దుపెట్టుకుంటుంది; ఆమె, వదినగారూ కలిసి నవ్వుకొంటారు.

"చిట్టిబాబూ, అమ్మకడుపులో ఉన్నప్పుడు నీవు చిన్నవాడివి. ఇప్పుడు కొంచం ఎదిగావు. ఇంకా కొన్నాళ్లకు మీనాన్నగారంత అవుతావు." అని శాంత బదులు చెప్పింది.

"అసలు అమ్మ కడుపులోకి ఎల్లావచ్చాను?" చెప్పమన్నాడు రామం. అప్పుడు, తల్లివిసిగి, మాటలు మరపిద్దామని "పిచ్చిబాబూ, ఇల్లా వేపుకతింటే ఎల్లాగ? తలంటుపోసుకొని నీస్నేహితుల్ని పిల్చుకురా. లే, తలంటు పోసుకో" అన్నది. కాని రామం తనప్రశ్నకు సమాధానం చెప్పితేగాని కాలు కదపనన్నాడు. కుఱ్ఱవాడితత్వం తెలిసినది కాబట్టి, కాస్త ఆలోచించి ఆమె చెప్పడం మొదలుపెట్టింది: "నీవు పుట్టక మునుపు నేను, మీనాన్నగారు, అంతాకలసి భద్రాద్రి పడవలో వెళ్లాము. భద్రాద్రి రాముడు నిన్ను మాకిచ్చాడు. అందుచేతనే నీపేరు 'రామం' అని పెట్టాము. నీతలకాయ బరువుకి వచ్చేటప్పుడు పడవ ఒక వైపునకు వంగిపోయింది కూడాను-మానాన్న తలకాయ ఎంతపెద్దదో" అంటూ రామం శిరస్సును తన రొమ్ముదగ్గరకు చేర్చుకొని ముద్దుపెట్టుకొంటుంది. ఆకథవిని రామం "బలే! భద్రాద్రి కథ, బలేబాగుంది!" అని గంతులేశాడు. తల్లి, శాంతకలిసి అతనికి తలంటుపోశారు. తల్లి "శ్రీరామరక్ష, నూరేళ్లు ఆయుస్సు" అని దీవించింది. రామానికి క్రొత్తబట్టలుకట్టి, జుట్టుదువ్వి తిలకంపెట్టి, అతన్ని చూచి ఆమెమురిసిపోయింది.

కొడుకును రాములవారి పటందగ్గరకు తీసుకొనివెళ్లి "నాన్నా, చదువు రావాలని దేముడికి దణ్ణంపెట్టు" అనగానే బాబు కళ్లుమూసుకొని దైవానికి నమస్కారం చేస్తాడు; తల్లి అర్ధనిమీలిత నేత్రాలతో ఆనంద పరవశురాలై పోతుంది.

శాంత నవోఢ, గర్భవతి కూడాను. వదినెగారి ప్రక్కన నిలబడి, యిదంతా చూస్తూ, తనభావి జీవితం-తనకు పుట్టబొయ్యే పిల్లలు-వారిని గూర్చి ఏవో తీయని తలపుల్లో మునిగి పోయి కాబోలు పరధ్యానంగా నిల్చుంది. ఆమెను వదినెగారు చూచి "ఏం, శాంతా అల్లాచూస్తున్నావు. నీకుకూడా బంగారం వంటి పిల్లలుపుడతారులే. మీదంపతులిద్దరు కూడా చాలాబాగా ఉంటారుకదా? మిమ్మల్ని చూస్తేనాకు చాలా ఆనందంగా ఉంటుంది.........సరేగాని నిన్ను ఒక్కమాట అడుగుతాను. అబద్ధం ఆడకుండాచెప్పు... నీకు మొట్టమొదట ఆడపిల్ల కలగాలని ఉందా లేక మొగపిల్లవాడు కావాలని ఉందా?" అని ప్రశ్నించింది.

శాంత, ఆమాటల ధోరణి గ్రహించి "ఓహో! తెలిసిందిలే కాణాచిగా అడిగావమ్మా! మొట్ట మొదటనాకు ఆడపిల్లే పుట్టాలని ఉంది. తప్పకుండా రామానికిచ్చి పెళ్లిచేద్దాం ఏమంటావు" అని అన్నది. ఆమాటలకు రామంతల్లి పరమానందంపొందింది. శాంతకు చప్పున ఆడపిల్లకలగాలని దీవించింది. ఆ ఆనందంలో చిట్టిబాబును, చిట్టిబాబుకు కాబోయే పెళ్లాన్ని తప్ప, తక్కిన ప్రపంచాన్ని అంతామరచి పోయింది.

ఆనాడు రామం స్నేహితులందరినీ పిలిపించి విందుచేశారు, ముత్తయిదువులు చాలమందివచ్చి, పసుపు కుంకుమ తాంబూలాలు స్వీకరించి రామాన్ని దీవించి వెళ్లారు.

సాయంత్రం దీపాలు పెట్టగానే, తల్లిబాబును దీపందగ్గరకు తీసుకువెళ్లింది. 'శీలరక్ష'కు 'దీప రక్షను' వేడుచు, దీపందగ్గరి తనచేయిని బాబుముఖానికి చేరుస్తూ, దీపంలోని దివ్య తేజస్సును బాబు ముఖంలోచూచి, ఆమాతృహృదయం పొంగిపోయింది. రాత్రి, రామం తల్లి పక్కలోనే పడుకొన్నాడు. తల్లిని కథచెప్పమని అడిగాడు. "ప్రొద్దుపోయింది, తిరిగి తెల్లవారుతే, బడికి పోవాలి, ఇంక పడుకో" మని తల్లిచెప్పింది.

"అల్లాగయితే, ఇంకనీకు ముద్దులు ఇవ్వను పో" అని బెదరించాడు బాబు. తల్లి, భయపడి కథను మొదలు పెట్టింది. "అనగా, అనగా, అశోకుడనే చక్రవర్తి మగధ సామ్రాజ్యాన్ని పరిపాలిస్తూ వుండే వాడు........." కథ మొదలుపెట్టిందో లేదో బాబు నిద్ర పొయ్యాడు. "పిచ్చితండ్రీ, నిద్ర పొయ్యావా" అనుకొంటూండగానే ఆమెకు మనసులో ఏమోతట్టింది. వెంటనే ఉప్పుతీసుకవచ్చి, దృష్టి తీసి, నూతిలో పడవైచి ఆమెకూడా నిద్ర పోయింది.

తిరిగి తెల్లవారింది. బాబుకు బడివేళ కావచ్చింది. బాబుకు అన్నంపెట్టడం ఆతల్లిఒక్కతే నిర్వ హించగలదు. బాబు పట్టిపేచీకోరు, తిండి సరిగా తినడు, బ్రతిమాలుకొని బామాలుకొని ఎన్నో తంటాలు పడితే రెండు మెతుకులు తినేవాడు. ఒకొక్కప్పుడు తిక్కవస్తే, సగం అన్నంలో లేచి పోయేవాడు. అప్పుడు ఆమె నిలువునా నీరయిపోయేది.

"నాన్నా, బడివేళయింది, చప్పున తిండితినిపో" అనికేకవేసింది తల్లి. బాబు తిండితిని వెళ్లేదాక ఆమెగుండెలు గుండెల్లో ఉండేవికావు. వచ్చి, సగంతిని, అదరువు బాగాలేదని పేచీపెట్టి, తిండితినటం మానేశాడు. ఆమెకు ఏంచెయ్యాలో తోచలేదు. బ్రతిమాలుకుంటే సామాన్యంగా వినేరకం కాదు. ఆమె

కళ్లలోనీళ్లు గిర గిరా తిరిగాయి. రామంచూశాడు. "అమ్మా; నేను అన్నంతినకపోతే, నాకే ఆకలి వేస్తుంది, నీకెందుకే కష్టం" అని దీనంగా అన్నాడు. ఆమె గద్గద కంఠంతో "నీకు పిల్లలుపుట్టిన తర్వాత తెలుస్తుందిలే నాన్నా" అన్నది. "అల్లాగయితే, అమ్మా, నాకు పిల్లలు ఎప్పుడుపుడుతారే?" అని ప్రశ్నించాడు. తల్లి సమయంకనిపెట్టి "తిండి తింటేగాని పుట్టరు" అని బదులుచెప్పింది. వెంటనే, రామం తిండితిని బడికివెళ్లిపోయాడు.

రోజులు గడచిపోయాయి. రామానికి బాల్యావస్థ దాటిపోయి కౌమారం ప్రాప్తించినది. తెలివి తేటలతో చదువుకొంటూ విద్యావంతుడవుచున్నాడు. తల్లి అతన్నిచూచి మురిసిపోతూ స్వప్నాలను గాంచుతుండేది. ఎవరికైనా అన్నిరోజులు ఒకేమాదిరిగా ఉండవు. కాలంలో ఇది ఒకవిశేషము. కాలమహా ప్రవంతి ఋజుమార్గంగాపోదు. కలరా వ్యాధివల్ల రామంతల్లి అకస్మిక మరణం పొందింది. రామం కుఱ్ఱవాడవటంవల్ల అపరకర్మలు తండ్రి నెరవేర్చాడు.

రామానికి అప్పుడే కళ్లువచ్చినట్లయింది. అతనికి ఏమీ పాలుపోలేదు-విచారించాడు............ విచారించాడు-కాని ఏమీతోచక, ఆలోచించటం మొదలుపెట్టాడు. ఆలోచించిన కొద్దీ మనస్సు పరిపరి విధాల పోతుంది. మనస్తత్వాన్నిబట్టి అది పరిపరి విధాల పరిణమిస్తూంటుంది. విధివిలాసం బహుచిత్రం. ప్రపంచంపుట్టిన దగ్గరనుంచీ తత్త్వవేత్తలు దీన్నిగురించి ఏమేమో వ్రాశారు. అవి అన్నీ నిజాలే-అన్నీ నిజాలు కానూకావు. ఒక్కొక్కప్పుడు సమస్తవిజ్ఞాన విశేషాలు బండసత్యాలుగనే తోస్తవి. రామం తల్లిమరణాన్నిగురించే ఆలోచించటం మొదలుపెట్టాడు. ప్రపంచంఅంతా ఇదివరకు మాదిరిగనే ఎందుకు ఉందో? అని తిన్నతాను ప్రశ్నించుకొన్నాడు. సూర్యుడు ఉదయిస్తున్నాడు. అస్తమించుతున్నాడు. రాత్రిపడుతోంది, తెల్లవారుతోంది. లోకంలో జనుల సందడి ఎప్పుడులాగే వుంది. రామానికి తల్లి పోయింది కదా అని కాలచక్రం తిరగటం మానివేయదుకదా! అనాదినుంచీ అవ్యవహితంగా ప్రవహించి పోతోంది కాలమహాప్రవంతి. రోజులు మాసాలు సంవత్సరాలు దొర్లిపోయాయి.

రామం ఇప్పుడు పెద్దవాడయ్యాడు. ఇప్పుడు విద్యావంతుడు. యువకుడు. ఇంక తల్లినిగురించి పదే పదే విచారించటం మానివేశాడు. సమస్తబాధలకు కాలమే సిద్ధాంజనం. ఇంగితజ్ఞానం కలవాళ్లు నిరర్థకం అనితెలిసి అయిపోయినవాటిని గూర్చి విచారించరుగదా? అల్లాగే రోజులు గడిపేశాడు. రామానికి వివాహం నిశ్చయమైంది. శాంతమ్మ, చిన్నప్పటినుంచీ అనుకొనే అల్లుడు, విద్యావంతుడు లభించాడుగదా అని మురిసిపోయింది.

తల్లి లేకపోయినప్పుడుగాని ఆమెవిలువ తెలియదు. మాతృహృదయం అవ్యయప్రేమ నిధానం. ప్రతిఫలాపేక్ష లేకుండా బిడ్డలకు పరిచర్యచేయుటయే ఆత్మధర్మంగా నమ్మటం ఈ లోకంలో తల్లికే చెల్లుబడి అయింది. పిల్లలు, ఆప్రేమను సేవను ఏ ఆలోచన లేకుండా అనుభవిస్తారు. కొందరు ప్రకృతి సిద్ధంగా అప్రయత్నంగా లభించే గాలి నీరు వలెనే మాతృప్రేమను సేవను పరిగ్రహిస్తారు. మరికొందరు కాలం మళ్లినతర్వాత, ప్రతిసేవ చేసేటందుకు వీలులేని దినములలో తల్లివిలువను గ్రహించి స్మృతులు చిత్రించుకొంటూ విలపిస్తారు. అప్పుడు, తల్లియొక్క, ప్రేమార్ద్ర వీక్షణాలు, అంధకార బంధురమైన స్మృతి విహాయస పథంలో మెరపుతీగవలె గోచరిస్తాయి. చెవిమారుమూలలలో ఆమె తియ్యనిపలుకులు ప్రతిధ్వనిస్తూనే వుంటాయి. ఇక మాతృఋణం తీర్చుకునేటందుకు రెండు వేడికన్నీటి బొట్లు రాలుస్తారు.

రామం వివాహం అతివైభవంగా జరిగిపోయింది. పెళ్లి అయిపోయిన తర్వాత శాంతాదేవి రామందగ్గరకువచ్చి "అమ్మ బ్రతికివుంటే ఈ మీ వివాహానికి ఎంత సంతోషించేదో కదా" అని గద్గద స్వరంతో పలికింది. వెంటనే, రామం కండ్లనుండి రెండువేడి కన్నీటిబొట్లు రాలాయి. "నాయనా, ఊరుకో, విచారించి ఏంప్రయోజనం" అని శాంతాదేవి ఓదార్చటం మొదలుపెట్టింది. రామం దుఃఖాన్ని చంపుకొని "అశ్రు తర్పణం మాతృఋణ విముక్తికి హేతుభూతం అవుతుందా?" అని తనలో తన్ను ప్రశ్నించుకొన్నాడు.

---

# వస్తాడా!



శ్రీ ధరణికోట శ్రీరాంగారు.

వస్తాడా!
అతడొస్తాడా!

రాజద్వారాల్ తెరిచారే
రంగుతోరణాల్ కట్టారే
రాగబంధముల నల్లారే
మూగనోములను నోచారే!

వస్తాడా!
అతడొస్తాడా!

పన్నీరత్తరు చల్లేరే
ముత్తెపు ముగ్గులు తీర్చేరే
వడి వడి ఆతని కర్పింప
వయసుకానుకల బట్టేరే

వస్తాడా!
అతడొస్తాడా!

విరులమెత్తలను గూర్చేరే
మెరుగుదీపముల నుంచేరే
మల్లె మాలలను అల్లేరే
మాటికి దిక్కులు చూచేరే

వస్తాడా!
అతడొస్తాడా!

తూరుపు వెల వెల బోయేనే
మెరుగు దీపములు మాసేనే
కూరుకు కన్నుల మూసేనే
మాలలు చేతుల నొరిసేనే

ఇంకా —
ఆతడు వస్తాడా!




# ఉప్పు

మా గృహలక్ష్మి పత్రికయందు ఫిబ్రవరి, మార్చి నెలలలో గృహవైద్యము శీర్షికయందు చింతపండు, మిరపకాయలను గూర్చి కొద్దిగ ఉదహరించిన విషయము పాఠకులందరు గ్రహించి యుందురనియే మా అభిప్రాయము. సామాన్యముగ వసంత ఋతువునందు కొన్ని పలుసరుకులు పూర్తిగ పక్వమగుటకు తగిన కాలమని కూడా వీటి ప్రశంస చేయుట యుచితమని తలచితిమి.

మరియు వసంతఋతువు, గ్రీష్మ ఋతువుల యందే దినకరుడు నిండుదీప్తితో వేళవిని మెరిపించి క్షారోదకమును గ్రహించి, మానవులకు, పశువులకు, సమస్త సస్యములకు అనుకూలమగు వర్షమును ప్రసాదించి సజీవవంతములుగ చేయుచుండుటయే ప్రకృతి శోభ.

ప్రతియింటను ఉపయోగించుకొను ఉప్పు, Common Salt ను గురించి అందరకు సామాన్యముగ తెలిసినవిషయమే అయినను వంటకములయందు షడ్రుచులలో ప్రధాన్యమయినది ఉప్పు. గాన అట్టి ఉచిత ద్రవ్యమగు ఉప్పుతో కొన్ని సులభోపాయములగు ఔషధ యోగములు, చికిత్సా స్వరూపములు కొన్నింటిని పేర్కొననగును.

సామాన్యముగ సూక్ష్మజంతు వృద్ధియగు నట్టివ్యాధులందును, కడుపులోని క్రిములను బయటకు త్రోయుచూ నాశనమొనర్చుటకును, పులిత్రేపులు, కడుపు ఉబ్బరము జ్వరములు మొదలగు వ్యాధులను రూపుమాపుచూ శరీరపోషణకు, అందమునకు అనువగునట్టి రక్తమునందు మాలిన్యము లేకుండచేసి, మంచిరక్తధాతువులతో నిండియుండునట్లు చేయుట కుపయోగించును. ఇట్టిసారయుతమగునట్టి ఉప్పు-చెమట, మూత్రము మొదలగు వాటిద్వారా వ్యయమగు నప్పుడు నీరసము, వ్యాధులను యెదుర్కొను శక్తిహీనమయినప్పుడు యిట్టి ఉప్పుచే ఉపకరించు ధాతువృద్ధి నొసంగుటకు వాడుటమంచిది. అగ్నిమాంద్యము, అజీర్తి, ఆకలి లేకపోవుట మొదలగు లక్షణములు కనుపించినప్పుడు జఠర రసమును వృద్ధిచేయును. అయితే శరీరము లావెక్కిన వారును, పాండువ్యాధి గ్రస్తులును, అతిదాహము కలవారును, చర్మవ్యాధులతో బాధనొందు వారును అతిజాగ్రత్తతో వాడవలయును. అనగా తగ్గించియే వాడుట శ్రేష్టము. సముద్రము నీటియందు

తగియుండినట్లు అయోడిన్ యిమిడియున్నది గాన గళగండలు, వాపులుగలట్టివారు స్నానముచేయుటయు కూడా మంచిది. శరీరమునందు Iodine చాలినంత లేకపోవుటవల్లనే అట్టివ్యాధులకు గురియగుచుందురు.

శ్వేతధాతువులను పరిశుభ్రమొనర్చుచూ రక్తకణములను వృద్ధిజేయును. మరియు కండరములు, నరములు, ఉదరములోని పేగులయందు అనవసరమగు ఉబ్బులను, గంటులను చక్కజేయును.

| | |
|---|---|
| ఉప్పు | 2 మొదలు 4 డ్రాములు |
| మంచినీరు | 4 ఔన్సులలో |

కలిపిత్రాగిన ఆవసరమగు వాంతి యగును లేదా మలశుద్ధిచేయుచు విరేచనములు గావించును.

జీవనాశక్తికి అవసరమగునది గాన పథ్యములయందేగాక, కొంతకాలము నిల్వయుండు ఊరగాయలను కూడ తప్పక నుపయోగించుచుందురు.

సామాన్యముగా ఆయుర్వేద సిద్ధాంతరీత్యా చప్పిడి పథ్యము (అనగా ఉప్పువదగ్గించి వాడుట) గాని లేదా ఉప్పును వేయించి వాడుకొనుటగాని నిర్ణయించుచుందురు. ఇట్టిది-పాండురోగులకు, శరీరము వాపు చూపినవారలకేయని-నిర్ణయింప బడినది.

ఉప్పును ఔషధ రూపేణ తగు మాత్రమగు పరిమాణములో వాడిన బల మొసంగు పదార్థములలో నొకటి అయినందున పురాణ వ్యాధుల యొక్క విషము హరించుటకు ఉపయోగ పెట్టుచుందురు.

జ్వరములు, అగ్నిమాంద్యము, శీతభేధులు, మొదలగు వ్యాధులయందు బిడ్డలకు యీవిధమున ఉపయోగించవచ్చును.

| | | |
|---|---|---|
| ఉప్పు | 5 గ్రెయిన్సు | |
| వాము | 2½ | ,, |
| మిరియములు | 1½ | ,, |
| శొంఠి | 1½ | ,, |
| కరక్కాయ బెరళ్లు | 2½ | ,, |

2 మొదలు 5 వరకు చూర్ణించి వస్త్రకాళితముబట్టి ఉప్పుచేర్చి తడవకు 5 గ్రెయినుల చొప్పున రోజుకు రెండుపర్యాయములు యివ్వవచ్చును.

అప్పటి కప్పుడు హఠాత్తుగా వచ్చు కడుపునొప్పివల్ల ఊపిరి ఆడకుండుట, బిగబట్టుట మొదలగు లక్షణములు కానుపించిన వెంటనే 'చిటికెడు' మెత్తని ఉప్పును నాలుకపై వేసిన, ఉమ్మినీరు ద్రవించి నాలుకకు రుచికల్గి, జీర్ణముగాక నిల్వయున్న యెట్టి గురుతర పదార్థమయినను ఉప్పునాలుకపై కరిగినట్లు కరిగి అజీర్ణముతొలగి జీర్ణశక్తిహెచ్చుగును.

టైఫాయిడు—

జ్వరములయందు ఔషధములు పనిచేయలేదని తోచినప్పుడు మంచిగమనికతో-2 గ్రేయినులు ఉప్పు చల్లని నీళ్లుగాని, గోరువెచ్చని నీళ్లు గాని 4 ఔన్సులలో కలిపి తడవకు ఒకఔన్సు చొప్పున ఇచ్చుచుండిన జ్వరతీవ్రతయందు కల్గువిషము శమించి దోషరహిత మగుచుండును.

**పరిణామ శూలలకు**

పుల్లత్రేపులు, చికాకు, భోజనానంతరము కల్గు నొప్పి, వాంతికానున్న లక్షణముల యందు చంచాడు (Spoonful) మెత్తని ఉప్పును వకమారు త్రాగుటకు చాలినన్నినీటిలో కలిపి యిచ్చిన ఉదర ప్రేగులకు అంటుకొని యుండు క్రిమిసముదాయ సంచలనముతగ్గి క్రిములు క్రమేణా తగ్గినందున పరిణామ శూలలుకూడ నివారణ యగుటవల్ల సాధ్యమయిన వ్యాధులనే పేర్కొన వచ్చును.

శీతజ్వరములకు, సంతత,........మొదలగు జ్వరములయందు జ్వరము అంతర్గత మయినదని తెలుసుకొన్నపిదప 1, 2 మోతాదులు అనగా ½ చంచాడు మెత్తని ఉప్పును వకఔన్సు నీళ్లలోకలిపి యిచ్చుచుండిన జ్వరతీవ్రత తగ్గును.

ఒక పిడికెడు ఉప్పును శుభ్రమైనదానిని తీసుకొని పొయిమీద కాలియుండు పెనముపైన వేసి, ఉప్పుయందుండు నీరును చెమ్మను లాగునంత వేడిమి కలుగనిచ్చి, గోధుమ రంగు వచ్చువరకు వుంచి అట్టిదానిని సీసాలో జాగ్రతపరచి, పెద్దవారలు వకచంచాడు ఉప్పును వకగ్లాసునీళ్లలో కల్పి ఉత్త కడుపుతో(ఏమియు ఆహారము పుచ్చుకొనకుండగనే) జ్వరమువచ్చుసమయమునకు ముందు పుచ్చుకొనవలయును. విడిచి విడిచి మరల తగ్గివచ్చు శీతజ్వరములకుకూడ యిట్లేవాడవలయును. తడవకు 1 ఔన్సు మోతాదున కంటే అధికము యివ్వరాదు; తక్కువనుకూడదు. వకవేళ దాహముగానున్నదని తోచినప్పుడు మంచినీళ్లు మాత్రము యివ్వవచ్చునేగాని ఆహారము యెంతమాత్రముకూడదు. గోరువెచ్చని నీటిని అప్పుడప్పుడు డ్రాముచొప్పుననే యిచ్చు చుండవలయును. రోగిఆకలిగా యున్నదని తెల్పినప్పుడు 4 8 గంటలు గడచిన తర్వాతమాత్రమే తేలికగా జీర్ణమగు ఆహారము నివ్వవలయును. ఈప్లుప్తకాలములో శీతగాలి తగులనివ్వకూడదు. వేడినిచ్చు ఉడుపులను మాత్రమే ధరించవలయును. ఇట్టిచికిత్స సక్రమముగా జరిపిన జ్వరము మరలతిరగ బెట్టదు. రోగులకు యిట్టిఔషధము రెండు పర్యాయములు మాత్రమే వాడవలయును.

మనకు కొంతవరకు (Saline Intravenous injection) లేక ఎనిమా యిచ్చుట అపకేషక చేసినపిమ్మట విషమించునట్టి అపాయ కరమయిన అవస్థలలోకూడా వాడుచుండుట తెలిసియేయున్నది.

ప్లేగు అనుభయంకర వ్యాధియందు వాంతులు, విరేచనములు కల్గినప్పుడు సామాన్యమయిన ఉప్పునీరు యిచ్చుటకూడాగలదు. శస్త్రవైద్యులు Injections of Salt water ను విషమ పరిస్థితుల ననుసరించి ధారాళముగా వాడుచుందురు. సామాన్యప్రజలుకూడా ఇట్టి అవకాశమునే అనగా ఉప్పు నీటిని ముక్కురంధ్రములద్వారా, నోటిద్వారా ఎక్కించి సుగుణములను గాంచుచుందురు.

ఉప్పునీటిని నాసికా రంధ్రములద్వారా వాడిన శీతలము శమించుటయేగాక చిత్తభ్రమ, ఉన్మాద చిహ్నములు శాంతించును.

ఇట్టి దానికై 6 గ్రైయినుల మెత్తని ఉప్పును 1 ఔన్సు నీళ్లలోవేసి బాగుగా కరుగనిచ్చి సీసాలోయుంచి భద్రము చేయవలయును. ఇది బిడ్డలకు వాడదగును.

రక్తము విషపూరితమైన పరిస్థితులయందు 1 ఔన్సుమంచినీటిలో 9 గ్రైయినులు మెత్తని ఉప్పును వేసి త్రాగుటమేలు.

బిడ్డలయొక్క ఉదరకోశములందు యేలిక పాములు జంతువాతము కల్గినప్పుడు స్మృతితప్పుట, కండ్లుమూయుట, మగత, మాట్లాడకుండుట మొదలగు సంధివాతలక్షణములు కానుపించినప్పుడు ఉప్పునీటిని పైనవివరించిన మోతాదు ఎనిమా చేయుటగాని లోపలకు యిచ్చుటగాని చేయవలయును.

## గొంతు కండరముల వాపునకు:

విషవాయువువల్లనూ, జలదోషమువల్లనూ, కాలమార్పువల్లనూ కలిగిన గొంతునొప్పి, మ్రింగుడు పడకుండుట, గొంతు కండరములు బిరుసెక్కిపోవుట మొదలగు లక్షణములు కానుపించినప్పుడు ఉప్పునీటితో గొంతును శుభ్రముచేయుట, పుక్కిలించి ఉమియుట మంచిది.

శరీరముపయిన వాపులు, నొప్పులు, రక్తము గూడుకట్టుకొనియుండుట వాతనొప్పులు, కీళ్లనొప్పులు తిమ్మిర్లు Stiff Nerves—Antiphlogistine దొరకని గ్రామాంతర స్థలములవారు ఉప్పును వెచ్చచేసి అవసరమగుచోట వత్తటము, కాపుబెట్టిన, వాతహరముగను, హాయిగను ఉండును.

దంతవ్యాధులు గలట్టి ప్రతివారును ఉప్పుమెత్తగా నూరి చూర్ణముగా గావించి పండ్ల Enamel అరుగకుండనటుల ద్రవరూపకముగ చేసుకొని మెత్తనిదూదితో పండ్లపై, రుద్ది వేడినీటితో పుక్కిలించి ఉమియుట వల్ల "పైయోరియా" అనుదీర్ఘవ్యాపితమగు వ్యాధినశించును. కొందరి చిగుళ్లు అతికోమలములై యుండును గాన సమయానుకూలముగ వాడుకొనవలయును. మరియు దంతముల మధ్యనిల్చియుండు కుళ్లిన పదార్థములవల్ల నోటియందు దుర్వాసన, విషము మొదలగువాటిని హరించుట కుపయోగించును.

ఉప్పు సర్వత్ర జీవకళలతో శాశ్వతముగా నీటియందో, గాలియందో, సాగరమునందో, అందు యుండుననక సర్వత్ర నిండియుండును. గాన మాతృదేవతలైన గృహలక్ష్ములు తమబిడ్డలు ఆరోగ్య ఐశ్వర్య సంపదలుగలవారలై చిరంజీవులుగ వర్ధిల్లగలరనే నిండు హృదయముతో పుత్రపుత్రికా ప్రసవానంతరము బిడ్డలపైన ఉప్పునీటితుంపురులు ప్రసాదింతురు.

# ఆహార పదార్థాల యోగ్యతా యోగ్యతలు.

శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు.

గతమాసం గృహలక్ష్మి పాఠకులు "గృహవైద్యము" అనే శీర్షికలో మిరపకాయను గురించి దాని విలువనుగురించి చదివిఉన్నారు. ఆవ్యాసంలో చెప్పబడిన విషయాలలో అసత్యం ఏమీలేకపోయినప్పటికీ, ఆహారపదార్థాలను గురించి సంపూర్ణసత్యం తెలుసుకోనేటందుకు అటువంటి వ్యాసాలు ఉపకరించవని రుజువుచెయ్యటానికి రెండుముక్కలు రాస్తున్నాను.

మనమంతా వాడే మిరపకాయనే తీసుకుందాం. మిరపకాయలో ఉండే విటమినులూ, ఖనిజాలూ మనశరీరానికి అవసరమైనవే కావచ్చు, కాని మిరపకాయమటుకు ఆరోగ్యకరమైనదికాదు. మన ఆంధ్రదేశంలో మిరపకాయ తిననివారుండరు. కాని ఎన్నడూ అలవాటులేనివారికి మిరపకాయ పెట్టినట్లయితే దానిమూలంగా కళ్ళల్లోనూ, ఛాతీలోనూ, మూత్రనాళంలోనూ మంటలు కలుగుతాయి. అధికోల్లాసంతో కూడిన ఛిరచిర కలుగుతుంది. బంకవిరేచనాలుగాని, రక్తమలలుగాని కలుగవచ్చు. అయితే ఆంధ్రులమందరమూ ఈ జాడ్యాలతో బాధపడుతున్నారా అంటే లేదు. గొడ్డుకారంమీదే ఎక్కువ ఆధారపడిన గుంటూరుమండలపు పనివాళ్లు చాలా ఆరోగ్యంగా ఉన్నట్టు కనిపించేమాట అసత్యంకాదు.

దీనికి కారణమేమిటి? అన్ని శరీరతత్వాలూ ఒకటిగా ఉండవు. అలవాటైన నీటిని బట్టీ, ఆహారాన్ని బట్టీ శరీర తత్వాలుంటాయి. ఎన్నడూ నీరుల్లి తిననివారు తింటే శైత్యం పట్టుకుంటుంది. అలవాటైనవారికి నీరుల్లివల్ల అపకారం ఏమీఉండదు, ఉపకారంకూడా ఉంటుంది. పాషాణంలాంటిది క్రమంగా అలవాటు చేసుకుంటే శరీర తత్వాన్ని మార్చివెయ్యటమేగాక కొన్నివ్యాధులకు శరీరం గురి కాకుండా చేస్తుంది. ఆవిధంగానే పుగాకు అలవాటు చేసుకున్నవారికి కొన్ని చిల్లరవ్యాధులు రావు. ఈ కారణాలనుబట్టి పాషాణంగాని, పుగాకుగాని మంచిదని నిర్ణయించటానికివీల్లేదు. వీటిలో కొన్ని వైద్యానికి హెచ్చుగా ఉపయోగిస్తాయి.

సామాన్యంగా ఏవస్తువు తాలూకు గుణంగాని అంచనా కట్టేటప్పుడు అలవాటులేనివాడి కది అపకారం హెచ్చుచేస్తుందా, ఉపకారం హెచ్చుచేస్తుందా అని చూడటం అవసరం. అలవాటు లేనివారికి హెచ్చు అపకారం చేసే వస్తువులను వర్జించటం మంచిది. అటువంటి పదార్థాలు అలవాటైన మీదట ఏమీ బాధించవనేది సరిఅయిన వాదనకాదు. మిరపకాయ పనికిరాని వస్తువుల్లోనే చేరుతుంది. అందులో ఉండే విటమినులూ, ఖనిజాలు మన ఆహారంలో మరోవిధంగా చేరే ఉపాయం చూడటం మంచిది. ఆమాట అని ఆంధ్రులం ఇప్పటి ఆర్థికస్థితిలో మిరపకాయను విసర్జించ లేకపోవచ్చు. అది మరోకథ.

ఆహార పదార్థాలను గురించి చర్చించేటప్పుడు మరొకదృష్టికూడా ఉండాలని నాఅభిప్రాయం. పాలూ, అన్నమూ, గుడ్లూ, అరటిపండ్లూ, ఆపిల్ పండ్లూ మొదలైన సంపూర్ణాహారాలను మినహాయిస్తే ఇతర ఆహార పదార్థాలు స్వతహాగా శరీరానికి ఏదోవిధంగా జబ్బుచేసేవే. కాని కొన్ని ఆహారాల కూడికవల్ల ఒకదాని దుర్గుణాలను మరొకటి సరిచేస్తుంది. ఈసమ్మేళనాలు తెలిసి ఉండటంవల్ల జనసామాన్యానికెంతైనా ఉపకారం ఉంది. కాఫీ, క్వైనాల చెడులక్షణాలను మిరపకాయ సరిచేస్తుంది. మిరపకాయ తాలూకు కొన్ని చెడులక్షణాలను గుడ్లలోఉండే గంధకం సరిచేస్తుంది, మనం సాధారణంగా మిరపకాయను నెయ్యిలో "విరుగుడు" చేస్తాం. బంగాలీలు నెయ్యిని మిరపకాయతో విరుగుడు చేస్తారు. వెన్నకాచి

నెయ్యిచేస్తూ నెయ్యి దించబోయే ముందు అందులో ఒక ఎండుమిరపకాయ తుంచివేస్తారు. ఇటువంటి అలవాట్లలో ఎంత వైద్యానుభవమైనా కనిపిస్తుంది. మనం సాధారణంగా జీలకఱ్ఱవేసి పచ్చళ్లను "బాగు" చేస్తాం. జీలకఱ్ఱా, ధనియాలు, మెంతులు, ఆవాలు, పసుపూ, ఇంగువ మొదలైన వాటితో మనం ఉపాయంగా అనేకరకాల కూరలను తినయోగ్యంగా చేస్తాం.

వస్తుగుణాలను గురించి జరిగే ఆధునిక పరిశోధనలు కూడా అగమ్య గోచరంగానే ఉంటూ ఉన్నాయి. ఎవరో ఒక శాస్త్రజ్ఞుడు నికొటీను ఇంజక్షన్లిచ్చి ఎలుకలను ఆయుక్షీణ మయిందనీ, ఉత్పత్తి శక్తి తగ్గిందనీ కనిపెట్టి పుగాకువాడే వారందర్నీ గాభరాపెడతాడు. ఎలుకలమీద పుగాకు పొగ వదలి పరిశోధనలు చేస్తే ఏంజరుగునో అదికూడా తెలుసుకోడు. అలవాటులేనివారికి పుగాకు వాంతులూ, ముచ్చెమటలూ, గుండెదడ, కంపము తెప్పిస్తుంది. అలవాటైన వారిలో ఈలక్షణా లేవీ కనిపించవు.

ఇటువంటి మూఢవిశ్వాసాలే ఆహార పదార్థాలను గురించి కూడా ముసలమ్మలు పిల్లలకు చెబుతూ ఉంటారు. "వంకాయబజ్జి, వళ్లెల్లగజ్జి" అనేసామెత చెబుతారు. వంకాయబజ్జి తినేవారికి గజ్జి వస్తున్నదా? ఒకవంకాయ గురించేకాక బెండకాయ గురించీ, దొండకాయగురించీ, గోంగూర గురించీ, చామదుంపలు గురించీ, సమస్తమైన వాటిని గురించీ పైత్యమనో, శైత్యమనో, వాతమనో, వేడనో చెబుతూ ఉంటారు. ఆమాట అనుకొని వీటన్నిటినీ విసర్జించటం అసంభవం. మనకున్న కూరలను ఏయేకలగలుపుల్లో తింటే నిర్దుష్టమైన ఆహారమవుతుందో, దేని దుర్గుణాల కేది విరుగుడో శాస్త్రీయంగా తెలియజేసినట్టయితే గృహలక్ష్మి పఠితులకు చాలా ప్రయోజన కరంగా ఉంటుందని నమ్ముతున్నాను.

* * *

[ఈవ్యాసం వ్రాసిన శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారికికృతజ్ఞులము. గృహలక్ష్మి మార్చి సంచికయందలి పాకకళలోని "మిరపకాయ" వీరికి విమర్శనీయమైనది. అయితే వీరు ఆవ్యాసములోని మొదటి పేరాలోనే, "మితిమీరి తినరాదు." అనియు "అలవాటు చేసుకొనదగదు." అనియు వ్రాయబడినదానిని గమనించినటు తోచదు. "కారము" షడ్రుచులలో చేరినది. ఆ కారముగల పదార్థములు నేడు ప్రసిద్ధములు: మిరియము, మిరపకాయ, అల్లము, లవంగము. 'ఆవ' కారములేదుగాని ఉద్రేకకారి. కాని వీటినన్నిటిని-మన మాహార పదార్థములలో వాడుచునే యున్నాము. వీనిలో సర్వేసర్వత్ర వాడబడునది 'మిరపకాయ'. దీనిని వీరు పాషాణము, పుగాకులతో పరిపోల్చుట వింత. అలవాటులేనివారికి పదార్థములు తింటే కలిగే అపకారోపకారాల హెచ్చు తగ్గుల విలువకట్టడంలో-చిక్కులు చాలా ఉన్నవి. విరివిగా వాడబడి అలవాటు కావడం వక్కటే, పరీక్షకాదు. కారణాంతరాలవల్ల అట్లా వాడుకలో వ్యాప్తిగలిగినీ, పుగాకు, దంపుడు బియ్యములవలె జాతియొక్క ఆరోగ్యాన్ని భంగపుచ్చేవి గలవు. వాటి సహజతత్వము ప్రచారమై, అవి దూష్యము కావడం అవసరమే. వైద్యులు అవసరము కొలది ప్రత్యేక పరిస్థితులలో వానిని వాడుదురుగాక.

అసలు ప్రకృతియే ఆయా ప్రదేశాలలో ఆదేశస్థుల తత్వమునకు సరిపడే సస్యములను, శాకములను, కాయగూరలను, పండు ఫలాలను- అమర్చుతున్నది. వాటికి వారు అలవాటుపడక పోవడం వైపరీత్యంగాని-అలవాటులేని వారికవి ప్రథమంలో వికటించడం విరుద్ధంగాదు. అందుచేతనే - మిరపకాయ విశేషంగా పంట పండే గుంటూరుజిల్లాలో వాటిని ధారాళంగా తినే-పల్నాటి యువతీ యువకుల జవసత్వాలనుచూపి చెప్పబడినది. ఈ విషయమై ప్రస్తావిస్తూ "గొడ్డుకారం మీాదే ఎక్కువగా ఆధారపడిన గుంటూరు మండలపు పనివాళ్లు చాలా ఆరోగ్యంగా ఉన్నట్లు కనిపించేమాట అసత్యంకాదు." అని రావుగారు వ్యంగ్యార్థకంగా వ్రాశారు. "కనిపించడ" మేగాదు; వారు వాస్తవంగాకూడా ఆరోగ్య భాగ్యవంతులే. దాని రహస్యం-వారు పుట్టిన స్థలంలో ప్రకృతి ప్రసాదించిన ఫలం-మనసార తృప్తిగా భోంచేయడమే ముఖ్య కారణము. కావుననే తెలుగు పత్రికయందు, తెలుగువారికై రచించిన పాకకళలో తెలుగువారికి తెలుగుదేశంలో పండే ఈ మిరపకాయను-ఔషధంగా మారుపేరుతో మ్రింగేదానికన్న, ఆహారంగా, ఆప్యాయంగా తనివితీర తినండి అనిచెప్పబడినది.

వీరివ్యాసంలో పూర్వవాదనలను పరవాదములే ఖండిస్తున్నాయి. వీరు సంపూర్ణాహారాలని పేర్కొన్న ఆకొద్ది వస్తువులుకూడా అలవాటు లేనివారికి వికటిస్తాయి. పాలు పైత్యం చేస్తవి; గోధుమ, జొన్నతినేవారికి (వరి) అన్నము నీరసంగా ఉంటుంది; గుడ్లు అరటిపండ్లు అజీర్ణకారులు కావడంకద్దు. తాత్కాలికోద్రేకం మాత్రం కలిగించి, పాషాణములవలె క్రొత్తగా భుజించేవారికి శాశ్వతంగా అపకారం చేయని, చేయజాలని, ప్రకృతిసిద్ధమైన షడ్రుచులలో నొక్కటైన దానిని, మిరపకాయను-వీరు-హెచ్చు అపకారం చేసేదానినిగా, జమకట్టి,-"మిరపకాయ పనికిరాని వస్తువుల్లోనే చేరుతుంది" అనడం మేము అంగీకరింప జాలము. వారు కడపటి పేరాలో చెప్పిన "మూఢ విశ్వాసాల"లో నిదియొకటి. 'ఆహారంలో వివిధవస్తు సమ్మేళనం'-అవసరం అనేది వాస్తవమే. దానివల్ల ఒకదానిలోటు ఒకటి కూడదీస్తుంది. అందుచేతనే పూర్వులు షడ్రుచులను విశదీకరించారు; షడసోపేతమైన భోజనమన్నారు. మరి వీరు 'మిరపకాయ' పనికిరాని వస్తువుల్లో చేర్చితే,-ఆ షడ్రసాలలో-'కారము' నకై-వారు కోరే శాకపాక సమ్మేళనంలో-ఏపదార్థం చేర్చమంటారో? మిరియమా, లవంగమా, అల్లమా,-లేక ఆవయా?

గృ॥ సం॥]

# బ్రతుకు తెరువు

## పన్నీరుచేయు విధము.

ప్రతియింటిలోను సులభముగ పన్నీరును (Rose water) తయారుచేసుకొను విధము. దొడ్లలో వేసి పెంచిన రోజా మొగ్గలను $2\frac{1}{2}$ శేర్లను కుండలోగాని, జాడీలోగాని వేసివుంచవలయును. పిమ్మట మరియొక కుండలో 5 శేర్ల శుద్ధజలమును పోసి పొయిమీదపెట్టి తెర్లనిచ్చి రోజా మొగ్గలమీదపోసి కుండమూతని మూసి గుడ్డతో కట్టవలయును. ఒకగంట అయినపిమ్మట మొగ్గలను మరియొకపాత్రలో వడియగట్టి బుడ్లకు నింపి, బిరడాలు బిగించి వాడుకొనవలయును. రోజాపూలు వికసించక మునుపే కోసి జాడీలో వేయుట మంచిది. బాగా పూసిన పూలకు మంచివాసన యుండదు.

## మరియొక విధము.

పైనచెప్పిన పరిమాణముననే మొగ్గలను నీళ్లను తీసుకొని కుండలోవేసి, మూకుడు మూసి, చీల మన్నుతో పాకిచేయవలయును. అనగా మూకుడును, కుండకుచుట్టూ మన్నుతో బిగించవలయును. ఆకుండను పొయిమీదపెట్టి సన్నసెగన 3 గంటల కాలము నుంచి, దించి, ఆరనిచ్చి, వడియగట్టి వాడుకొన వలయును.

### పల్లు పొడి.

| | | |
|---|---|---|
| సీమ సున్నం | 40 | తులం |
| లవంగముల పొడి | $2\frac{1}{2}$ | ,, |
| లవంగపట్ట పొడి | $2\frac{1}{2}$ | ,, |
| ఏలకుల పొడి | $2\frac{1}{2}$ | ,, |
| అక్కలకఱ్ఱ పొడి | $2\frac{1}{2}$ | ,, |
| పటిక పొడి | $1\frac{1}{4}$ | ,, |
| మెంతాలుగాని కర్పూరంగాని | $\frac{1}{2}$ | ,, |

సీమసున్నం తప్ప తక్కినవాటిని మెత్తగ పొడిచేసి వస్త్రకాళితముపట్టి పిమ్మట మెంతాలో కర్పూరమో సీమసున్నములో కలిపి పొడిచేసి జల్లించి కడపట వస్త్రకాళితము పట్టిన పొడిలో కలిపి 3 సార్లు జల్లించి వాడుకొనవలయును. ఈ పొడి దంతములకు చాల శ్రేష్టమైనది:

——:o:——




గాంధీ మహాత్మునకు ఢిల్లీలో వైస్రాయి దంపతులు స్వాగతం యిచ్చారు.






ఇండోనేషియా ఆహారకమిటీవారు ఢిల్లీనుంచి మద్రాసువచ్చి,
మన మంత్రులతో ముచ్చటించారు.
రాజధానిలోని రేషన్ పద్ధతిచూచి వీరు ఆశ్చర్యపోయారు.




## దేవతలకు ప్రియమైన నైవేద్యం—మత్స్యాహారం.

హిందూదేశంలో అన్ని రాష్ట్రాలకన్నా వంగీయులు ఎక్కువగా జాలరితనానికి పోతారు. ఏమంటే ఇతర రాష్ట్రీయులకన్నా వంగీయులెక్కువగా చేపలు తింటారు. అందులో 80% విధిగా తింటారు. ఒక్క వైష్ణవులు, వితంతువులు మాత్రం ముట్టుకోరు. ఏటిగట్టునా, సముద్ర పొడ్డునా ఉండే బ్రాహ్మణులూ చేపలు తింటారు. మిగతా బ్రాహ్మణులకూ బంగాళీ బ్రాహ్మణులకూ ఉన్న తేడా యిదే. అందుకే వాడికీ వీరికీ సంబంధ బాంధవ్యాలుండవు. ఎవరో కొందరు మతస్థులు అనేకులు జంతుబలి యిస్తారు. మాంసం నిస్సంకోచంగా ఆరగిస్తారు.

ఇక నైవేద్యం అక్షతదియకు వంగీయులంతా 'కాసుందీ' పండుగ చేసుకుంటారు. పండుగొస్తుందనగానే ఆవాలు ముందుగానే ఎండపెట్టుకుంటారు. వాటిని కడగ డానికి తిథివార నక్షత్రాలు తిరగేసి ముహూర్తం పెడతారు. ఆవేళే అనుకున్న జలాధారంలో ఆయింటి పుణ్యస్త్రీలు సమంత్రకంగా స్నానం నీమంతో ఎండబెడతారు. పండగనాటి కవసరమయే ఆవాలు ముద్దచేసుకొని దానో నీటికుండలో పెద్దముత్తయిదుచే కలిపిస్తారు. ఇందుకని ముందుగనే ఒక కొత్తకుండలో నీళుపోసి మరిగించి ఉంచుతారు. వీలుబట్టి ఆకుండలో రెండు మూడు మామిడి కాయలు కూడా వేసి ఉడికిస్తారు ఇదంతా పాకమై చల్లారి పేరుకున్నాక, ఆముద్దతీసి వేరే కొత్తకుంశలో ఉంచుతారు కాసుందీకి పార్వతిని పూజిస్తే కష్టాలు తొలుగుతాయని వాళ్లనమ్మకం. ఈపూజకు తతంగం నడిపేదంతా బ్రాహ్మణుడే. పార్వతికి అన్నం, కూరలు, పప్పు, మిర్చి, మసాళా

దినుసులు, చేపలు, ఆవాలముద్దా అన్నీ నైవేద్యం పెట్టి ప్రత్యేకంగా వండుతారు. ఇంటిల్లిపాదీ ఉపవాసంతో ఉంటారేమో, పూజా పునస్కారాలవగానే ఆ నైవేద్యం అంతా అయూక సుష్టంగా ఆరగిస్తారు. ఇందులో భోజనానికి కొంతభాగం పౌరోహితునికి ముందుగానే యిచ్చేస్తారు. మళ్లీమాఘంలో పంచమినాడు సరస్వతిని పూజిస్తారు. సరస్వతికి 'హిలస' (చేపలు) అంటే యెంతో యిష్టం. ఈ పర్వదినానికి కొన్ని జిల్లాల్లో ఒకజత చేపల్ని పుణ్య స్త్రీలతో యింటి మధ్యగదిలోనికి పట్టించు కెళ్లడం ఒకఆచారం. అవైనా బ్రతికుండాలి. పూజా సమయం వరకు సజీవం అయివుండాలి కాబట్టి, అంతవరకూ వాటికి మేత వేసి పెంచుతారు... చేపపై పొలుసు ఆగదిలోనే ఓమూల కప్పెడుతారు. ఇలాచేస్తే ఆకుటుంబం ఆయురారోగ్యైశ్వర్యాల్తో తులతూగు తుందట.

పాశ్చిమ ప్రదేశాల్లో దుర్గ పూజ మూడురోజులూ రకరకాల చేపల్ని తెచ్చి నైవేద్యం పెడతారు. ఢక్కాజిల్లాలో మూడోనాడు అక్రితంనాటి అన్నం నీళ్లలో ఉంచుతారు. వాలుగుచేపల పులుసు, తామరతూడు పచ్చడి దశమినాడు అమ్మవారారగిస్తుంది. ఈఅమ్మతల్లి సంవత్సరం అంతా మరోలోకంలో దరిద్రుడూ, తాగుబోతు అయిన భర్తతో కాపురించి, ఈఅయిదు రోజులూ భూలోకాన ఉంటుందిట. అందుకనే ఈ దివ్యభోజనం.

దీపావళ్లికి కాళీకి పెద్ద వెడల్పయిన చేపల్ని తెచ్చి నైవేద్యం చేస్తారు. భవానీరాణి జ్ఞాపకార్థం భవానీపూర్‌లో ఒక దేవాలయ నిర్మాణం జరిగింది. ఇక్కడే రామకృష్ణుడు కైవల్యం పొందాడు. ఈస్థలాన చేపలు నిత్య నైవేద్యం. చేపలతో పాటు తాటిపళ్లూ సమర్పించు కోవాలి. తాళఫలాలు కాలంగాని కాలంలో గూడా కాళికాలయంనవాటిలో దొరుకు తుంటాయి. సంవత్సరం అంతా తాటిపండ్లు దొరకడం కేవలం భవానీ మహత్యం అంటారు. డిశంబరు, జనవరిల్లో ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది.

వీరు వారనకుండా అన్నికులాల వారూ ఉగాది ఉత్సవాలు చేసుకుంటారు. సంక్రాంతి నుండే ప్రారంభం. సంక్రాతి అర్ధరాత్రిని శివుని పూజిస్తారు. కందాళ్కు ద్రావిడ పూర్వులు హఠాత్తుగా చని పోయారని, వారిఆత్మ శాంతికి చౌకరకం పౌరోహిత్యం చేసేవారంతా శ్మశానానికి పోయి, కాష్ఠంలో మిగిలిన కొరకంచులు, కొరివిలుతెచ్చి అన్నం వండుతారు. ఆనిప్పుల పైనే చేపలు పేర్చుతారు. అక్కడే, ఆ అర్ధరాత్రినే అవి శివునికి నివేదిత మవుతాయి. ఈ ప్రసాదం అలాటి తక్కువ తరహా వాళ్లే కళ్లకద్దుకు తింటారు. నైవేద్యం పెడుతూ నాభక్తుడు వాళ్లు తెలియని ఆవేశంలో తనకూ అర్థంగాని

భాషలో మంత్రోచ్ఛారణ కానిస్తాడు. పంట పొలాలదేవత క్షేత్రపాలునికి, జయమిచ్చే జయదుర్గకు కాల్చిన చేపలంటే మహా యిష్టం. కావాలంటే ఫరీద్‌పూర్ జిల్లా ప్రజల నడగండి.

మంచికీ—చెడ్డకీ—మత్స్యాలే!

వివాహం అనగానే ఎక్కడైనా ఏదోఒక తతంగం ఉంటుంది. అందుకని అవసరమయే విషయాలు వివిధాలు. వంగీయ వివాహాలు చేపలులేనిదే జరుగవు. పెళ్లిముందు సంబధం ఖాయం చేసుకున్ననాడే ఆడ, మొగ పెళ్లివారు ఒకరికొకరు రెండేసి చేపలు పంపుతారు, తాంబూలం పుచ్చుకున్నట్లుగా. అయితే ఈ రెంటిలో ఒకటి వయసు పరిమాణాలలో పెద్దదైయుండాలి. చేపలతోపాటు తాంబూలం, పెరుగు, బట్ట, గంధం, పూసలు, మొలనూలు పంపుతారు. చేపలవలెనే ఆకాబోయే దంపతులూ వంశం వృద్ధి చేయాలని పెద్దల ఆశ. కొత్తకోడలు అత్తారింటికి మొట్టమొదటిగా వెళ్లేప్పుడుకూడా చేపల్ని పట్టించు కెళ్తుంది. కొత్తకోడలికి అత్తగారు రకరకాలు మత్స్యాల తెప్పించి యిస్తుంది. వాట్లోంచి ఏదోఒకచేపను కోడలు తీస్తుంది. తీసిన చేపనుబట్టి కోడలు గుణగణాలు గ్రహించేస్తారట! వధూవరులు వివాహదినాల్లో అనుదినం చేపలే తినాలి. అందులో ఏమాత్రం వదలకుండా తినేయాలట! ఖర్మంజాలి పెళ్లికూతురు దిగబేడితే వితంతువై పోతుందట! వధూవరులతోపాటు విధిగా పుణ్యస్త్రీలూ తింటారు. ఎవరైనా ఆనాడు తినకపోయినప్పటికీ పర్వదినాల్లోనైనా తినకతప్పదు. కోడలువచ్చిన తొలినాడు కాకున్నా అత్తవారింట ఋతుస్నానం అయాకనైనా చేపలు తినాలి. చేపలే కానుకలుగా ఇచ్చుకుంటారు. వాటిని బంధుమిత్రులకు పంచుతారు కూడాను.

శ్రాద్ధంలోకూడా చేపలే-వితంతువులు మాత్రం చేపలుతినడానికి నోచుకోలేదు.- శ్రాద్ధంనాడు పోయినవాని కుటుంబం అంతా విచారసూచకంగా దుస్తులు వేసుకుంటారు. విధిగా గ్రుడ్లు, పప్పు, ఉల్లి, చేపలూ తింటారు. క్షురకర్మ మానుతారు. కాని ఈ నిషేధం "మత్స్యముఖి" లో లేదు. కర్మచేసేరోజుల్లో ఒకదినం చేపలకనే ప్రత్యేకింపబడినది. పోయినవాని దగ్గరిచుట్టం వయోధికుడు తాను తినబోయే దాల్లోంచి ఒక ముక్క కర్మచేసిన వాడికిస్తాడు. ఇది చేస్తేచాలు మిగతా తంతు జరుగకున్నా ఫర్వాలేదు. ప్రేతప్రీత్యర్థం కర్మరోజున బ్రాహ్మణులు ఆవులశాలలో అన్నంతోపాటు చేపల్ని వండి బ్రాహ్మణులకు వడ్డిస్తారు. చిన్నదినంనాడు కాల్చినవాటినీ పచ్చిచేపల్నీ దానం పడతారు.

—(o)—

# గీ గూ గుంయిః

శ్రీ కవికొండల వెంకటరావుగారు.



'కన్నెపిల్ల'
'ఏమికన్నె'
'దూడకన్నె'
'ఏమిదూడ'
'కోడెదూడ'
'ఏమికోడె'

'నిప్పుకోడె'
'ఏమినిప్పు'
'అగ్గినిప్పు'
'ఏమిఅగ్గి'
'ఏనుగ్గి'!!

అని, ఓతాయిలంగారు ఓతాయిలంగార్ని చెవిమెలిపెడతాడు.

రెండో తాయిలంగారు ఏడుస్తాడు. మొదటి తాయిలంగారు ఏంచేస్తాడు? "వొరే, వొరే చూడు చెవిలో దూరిన ఏనుగుగీని పోం గొట్టనా?" అంటూ ఇలాచెప్తాడు.

"ఏనుగు నుండి-ఏ-తీశేస్తే?"

'నుగు-వుంది'

'ను-తీశేస్తే? 'గు వుంది'

'గు-నీ చెవిలోకూ త్తే?' అంటూ

'గూ' అని వూదును 'ఏనుగు ఎగిరిపోయింది.'

'ఏనుగుతోపాటు-గీ-పోయింది'

రెండో తాయిలంగారు అప్పటికి తెలివిగొంటాడు.

'మఱి ఈమాటు నాది ఆట' అంటాడు.

'సం యేనా? కంయి మనవుగదా?' అని కవ్విస్తాడు.

'ఓరీ బంయా! నేనటాగ్రి కంయి మనేది! సంయి!'
రంయని ఆడు! సంయి"

'ఇదిగో! గూబ గుంయి' అని చపేటఇస్తాడు. ఇస్తూఅంటాడు "నాచెవిలో-గూ-నీగూబను గుంయి మంది, ఆట ఆట చెల్లు. గీ గూ గుంయి వెళ్లు!"

—:o:—

# దయ్యములు

శ్రీమతి కృష్ణాబాయిగారు. 1947



## స్త్రీలకు వానియందలి మూఢ నమ్మకములు:

దయ్యములు అనునవేవియో మనకంటి కగుపడని కొన్ని భయంకర జీవజాలములని మనవారలందఱకు నొక పెద్ద నమ్మకము గలదు. చీకటిలో నడచిపోవుచుండ దూరముగా నెక్కడో మనకు నొక పెద్ద వెలుగు గానుపించు చుండును. సాయంసమయమున నూరి వెలుపలకుఁ బోతిమేని శ్మశానమునందలి మంటలు గానవచ్చుచుండును. ఇవియన్నియు దయ్యములని మనవారల యభిప్రాయములు. ఈ తమ యభిప్రాయముల వారు తమ బిడ్డల కుగ్గుపాలతో నేర్పుదురు. అది వారలకు అస్థినిబట్టి యుండును. చీకటినిగూడ జూచి వారు దయ్యమని భ్రమింతురు. సాయంసమయమైనచో నెచ్చటకు వెళ్ళుట యనినను విపరీతమగు భయముతో నడలుచుందురు. ఇక నేదైనా కొంచెము పడిసెముపట్టినా, దగ్గు వచ్చినా గూడ దయ్యములే. అది మొదలు కోయవాళ్ళేగాదు, ఏనాదులేగాదు, జంగములేగాదు, మొగమున నింత విభూతి పూసికొని యెవఁడువస్తే వానిదగ్గఱ రక్షరేకులు కట్టించి విభూతులు పెట్టుచుందురు. ఎందుకు? వానితో నాదయ్య మెగిరిపోవునని.

లేనిపోని ఈ రాగిరేకులు కట్టుకొనుటవలన; గుండెలు చీరికొనిపోవుట, పెట్టుకొన్న నగలేమైనా యుంటే అరగిపోవుట, దాచిపెట్టుకొన్న ధనము నాశనమగుట ఇవియే వీనివల్ల గలిగే ప్రయోజనాలు. ఇక నిట్లు మూఢనమ్మకముగలవారల నిట్లు వంచించి, యీ మాయావు లెంతధనము నార్జించుచున్నారో దైవమున కెఱుక.

ఆరు, ఏడు సంవత్సరములక్రిందట నొక మోసకత్తె సోది చెప్పుదుననియు, నున్నదున్నట్లు చెప్పుదు ననియు, వచ్చి యొకచెట్టుక్రింద దిగినది. వేనకువేలు జను లామె చుట్టు జేరిరి. మాయింటి పొరుగావిడ కొక పిచ్చిపిల్ల గలదు. ఆపిల్ల పిచ్చిపోవునని పాపమామె పదిరూపాయలిచ్చి యొక రక్షరేకు తెచ్చికొనినది. ఇది యేమిటో చూడాలని స్కూలునుండి వస్తూ మావిద్యార్థినులము గూడ అక్కడ జేరాము. ఆమె చెప్పేమాటలు వింటూంటే నాకామె మహాత్మ్యమేదో చూడాలని బుద్ధిపుట్టింది. వెంటనే నాపక్కనున్న స్నేహితురాలిని చూపించి యామెకు పెండ్లి యెప్పుడగునో చెప్పమంటిని. కనురెప్పలు పైకెత్తి యాలోచన నటించుచు, నామె తన మామూలు పాటనే యారంభించినది.

"ఈమెచేతిలో మంచిరేక యుండాది, వచ్చే పున్నం నాటికి మెడలో బొందు పడిపోతది మంచి ధనంగలవానికి భార్యా అవుతది" అని, "అమ్మాయీ! నీచేయికూడా చూపించు, నీకుకూడ చెబుతాను" అంది, నిజాని కాపిల్ల కప్పడికి పెండ్లి అయిపోయింది.

నావళ్ళుమండింది. నాతోవచ్చిన పిల్లలంతా నవ్వడంమొదలెట్టారు. వాళ్ళతో నేనుగూడ నవ్వాను. ఇంటికివచ్చి "యిల్లాంటి మాయావిల నెందుకు శిక్షించరమ్మా గవర్నమెంటు?" అనినేను మాఅమ్మతో అంటూంటే, అంతలో నరువదియేండ్ల ముత్తయిదువు మా అమ్మమ్మవచ్చి "నీకేం తెలియునే! వాళ్ళలో ఒక్కొక్కళ్ళకుంటే యుండవచ్చునట్టి మహత్యము, కాకపోయినా, ఏదో దాని పొట్టకూటి కది యడుక్కొంటోంది. నీకెందుకూ! నీచదువు నీవుచదువుకోక," అని చీవాట్లు పెట్టింది. చిన్నతనమగుటచే ఆమె కోపమునకు హడలిపోయి మాట్లాడకుండా వెళ్ళిపోయాను.

కూటికి లేకపోతే, ఈవిధంగా ప్రజలను మోసగించి డబ్బుసంపాదించడ మెందుకు? మనము వారి మోసమునకే లోబడి వారికి డబ్బునెందుకివ్వాలి? అసలు దీనికంతకూ కారణము! ప్రజలలో నుండే ఒక మూఢనమ్మకము, అందులో స్త్రీలలో నెక్కువగాఁ గానుపించు భ్రమ. కొద్దియో, గొప్పయో, స్త్రీవిద్య వృద్ధిగాంచి విజ్ఞానాశయములు విరియుచున్న యీరోజులలోగూడ స్త్రీల కిట్టి తలంపుల యందలి నమ్మకముజూడ నచ్చెరువు గొలుపక మానదు.

ఆపిల్లకా పిచ్చిపోలేదు సరిగదా! నాటికీ నేటికీ ఆమాయావి మరల గనబడలేదు. దానివద్ద మందులు పుచ్చుకొన కొందఱకు వికటించినవి. ఇంకను నిట్టిమోసములు ప్రపంచమున నెన్ని జరుగుచున్నవో! ఇట్లే యొకమంత్రగా డొకామెకు బిడ్డలుపుట్టుటకు రక్షరేకు నిచ్చెదనని, యింటిలో దేవతారాధనఁ జేయుచు నొకబంగారు వస్తువు నపహరించె.

ఇన్ని జూచుచున్నను ఈదేశములో జనమునకింకను దయ్యములమీద అనుమానము పోలేదు. ఎవఁడైనా 'మీ అదృష్టముచెబుతా' నంటూ వచ్చాడూ అంటే, వానిచుట్టూ ఈగలు పోగయినట్లు పోగవుతారు, డబ్బులవర్షం గురిపిస్తారు.

ఇకవాఁడు "నీకు నలుగురుబిడ్డలు, నీకు ధనధాన్యాదులు వస్తాయి, నీకు పులుపిష్టము, కారమసహ్యము, కోపమెక్కువ, పైకి చిరచిరలాడుతావుగాని ఆంతరంగికంగా నెవరికి నపకారము దలంపవు" అని యీరీతిగా వాని ధోరణిలో వాగుతూయుంటే, ఎవరైనా వచ్చి, "ఎందుకీగోల! ఇందులో మనకుఁ దెలియనిదేమున్నది? ఇట్లు చెప్పుటవల్ల నేమిప్రయోజనము? వీనివల్ల మనకు బోధపడున దేమిటీ" అనినచో, "ఎందుకేమిటీ! మనవన్నీ వాని కెట్లాతెలుస్తాయి, మనింటిలో దూరిచూచాఁడా! ఎంత మహానుభావుఁడు కాకపోతే అట్లా చెప్పగలఁడా! వాఁడు చెప్పినట్లు నీవు చెప్పగలవా!........"అని గుడ్లు ఎఱ్ఱజేస్తారు.

ఎందుకూ పనికిరాని యీసామర్థ్యమెందుకో నాకర్థంగాదు. వెనుకటికెవరో యొక నిరక్షరాస్యుఁడగు బ్రాహ్మణుడొక మహారాజును దర్శింపఁబోవుచు నారాజునకుఁ దానుజ్యోతిష్యముచెప్పి మెప్పింపవలయునని ముందుగా నాయూరిలో నందందఁదిరిగి, యారాజు గుణగణము లన్నియుఁ దెలిసికొనెనట. అట్లే యుండ గూడదా డబ్బు సంపాదించుటకుఁ బన్ను వీరికుయుక్తులు.

అంతవరకెందుకు? మనముచెప్పలేమా! సాధారణముగా నేవ్యక్తినైనా ముఖముఁజూచి, యావ్యక్తి యెట్టివాఁడో, జ్ఞానియో! చదువరియో! వయస్సెంతో! సులభముగాఁ జెప్పవచ్చును. అది వీరు చెప్ప నక్కరలేదు. వ్యక్తిగతంబుగా నడచుకొను ప్రతివ్యక్తికి అట్టి మనోశక్తి సహజం.

ముష్టివాఁడు వీధిలోనికి వస్తే పిడికెడుముష్టికి వెనుకదీయు మహిళామణు లీకరవు రోజులలోఁగూడ నీమాయావుల నెత్తిమీద చిల్లరధనము గుతిపించుట కెంతమాత్రము వెఱువరు. క్షమించి, సోదరీలు నాయందభిమానము జూపుదురుగాక.

'అన్నమో! రామచంద్రా!' యని అంగవిహీనులగు వారెందరో యేడ్చుచుండ, వారికేదైన నిచ్చిన యెంతపుణ్యము? ఎంత భూతృప్తి, ఎంత హృదయసుఖము? మానవ సేవయేగాదూ మాధవ సేవ!.

సాధారణముగా భారతీయ నారీమణులు తమకేది వచ్చిననూ దయ్యమనియే భావించుచుందురు. తఱచుగా నిది నేను జూచుచున్నాను. అందులో రెండవపెండ్లివానికి పిల్లనిచ్చి పెళ్ళిచేస్తే తప్పకుండా సవతి దయ్యమై పట్టుకుతీరుతుంది. ఆమెకు తలనొప్పి, కాలునొప్పి వచ్చినాసరే, తప్పకుండా సవతియే ఆమెను పట్టుకు పీక్కుతింటోందంటారు.

ఇరుగు పొరుగు వారలందఱూవచ్చి, "అయ్యో! అమ్మో! ఎల్లాఅయిపోయిందో! తప్పకుండా సవతే పట్టుకుందీమెను, గుడిలో విభూతినైనా పెట్టలేకపోయనారా! ఆ పరబ్రహ్మస్వామివారియొద్ద రక్షరేకైనా కట్టలేకపోయారా!" అని అంటారు. అదిమొదలు, రావిచెట్టుక్రింద కోయవానియొద్దను వలసపోయివచ్చిన స్వాములవారియొద్దను, దేశాంతరగతుఁడై వచ్చి గుడిలో మకాముచేసిన మహాసన్యాసి యొద్దను రక్షరేకులు, విభూతులు, ముడుపులు - పెళ్ళినాఁడత్త వారికొత్తకోడలికి నగలుపెట్టినా పెట్టక పోయినా, యీనగలుమాత్రం - మెడనిండా అలంకరిస్తారు. త్వరలో దగునౌషధమెఱుంగక రోగము ముదురుతుంది. ఇక కుదరదు........జన్మాన రోగము, నీరసము, ఇక సవతిదయ్యము వదలదు.......అంతే. తరువాత వీరలు మధ్యాహ్నము తీరికగా నున్నప్పు డిరుగుపొరుగు వారలంతాగూడి కబుర్లు మొదలిడెదరు.

"లక్ష్మమ్మపిన్నీ! చూచావా! మాదొడ్లో చింతచెట్టుందే, ఆచింతచెట్టుమీద దయ్యముంది. వెనుక మావదిన చచ్చిపోయిందే, ఆవిడే దయ్యమై వచ్చిందమ్మా! మొన్ననాకుఁ గలలోఁ గనఁబడి చీర రవిక పెట్టమనిచెప్పింది. మాఅన్నయ్యను పోరిపోరి పెట్టించాను, పెట్టకపోతే యెల్లాగుచెప్పు? ఇంటికేమైనా చలువ యుండొద్దూ!" వెంటనే ఆలక్ష్మమ్మగారందు కొంటుంది "అయ్యో! కాదమ్మా మరి, పిల్లలతోటీ. మాముసలమ్మ అల్లాగే దయ్యమైనదమ్మా! అందుకే సందెవేళ మాదొడ్లో చింతచెట్టుదగ్గరకు వెళ్ళడానికి మాకందఱికి భయం. మాపిల్లల నందఱనూ ప్రొద్దుగ్రుంకితే అక్కడకు వెళ్ళవద్దన్నాను. వాళ్ళకి హడలు. వాళ్ళక్కడికి రాత్రికాదు సరిగదా, పగలుకూడ వెళ్ళరు." అని మొదలెడతారు.

చూచారా! మనవారల మూర్ఖత. పిల్లలను భయపెట్టి వారల ధైర్యశక్తులను జంపివేయుడమే కాకుండా, ఇంకా 'మాపిల్లలచ్చటికి పగలుకూడా వెళ్ళరని' గొప్పగా నిరుగు పొరుగువారలతోఁ జెప్పు కొనుట గూడాను. విదేశీయులంతా యిల్లాగే యున్నారా! వారలు భయమనున దెరుగరు సరిగదా! మీదు

మిక్కిలాదయ్యమెట్టిదో చూచెదమని ముందడుగు వైచెదరే! ఈ విపరీతమునకుఁ గారణమేమి? వారల పెంపు మహాత్మ్యమది, మనవారల పెంపు మహాత్మ్యమిది. అందుకే ఈదేశములో వీరత్వమను పేరే ప్రాతయయినది.

తొల్లి ఛత్రపతి శివాజీ అంతవాడగుటకుఁ గారణమేమి? తల్లి యుద్బోధయేగదా! అతని వీరత్వమునకుఁ బునాది. చిన్నప్పుడు పిల్లలకేది అలవాటుచేస్తే, అదే వారల పెద్దతనమున వేళ్ళుబారుకు పోవును. ఇక నీపెద్దలు చెప్పుమాటలు పిల్లలు విని, వారిలో వారు, మాచింతచెట్టుక్రింద దయ్యమున్నదని, మాముసలమ్మ దయ్యమైనదని, చీకటిలో నచ్చటకేగితే మ్రింగుతుందని చెప్పుకుంటూ, 'అదిగో దయ్యమంటే, అదిగో దయ్యమని', 'మాకు కనుపించినదంటే మాకు కనుపించినదనీ' మొదలు పెడతారు .వారికది పరిపాటైపోతుంది. పెద్దవారైనా అంతే. ఒకవేళ యెవరైనా యున్నారేమో నూటికొకరట్టి దయ్యములను నమ్మక పరీక్ష జూనువారలు కాని, మూడువంతు లాబాలగోపాలము దయ్యములంటే నమ్మకమే, భయమే నాయెరుగు నంతలో. ఇదియే వారిబిడ్డలకు, మనుమలకు, మునిమనుమలకు, "తాతపోసినగంజి తరతరాలకు" అనునట్లు తరములవెంబడి యిదియొక యలవాటు, పరిపాటు, ఆచారము. పైగా వానిని నమ్మకపోతే, అవి మీదపడి పీకుతాయేమో! అని భయపడేవారలుగూడ యున్నారు. ఎంత యజ్ఞానము, ఎంత యవివేకము, ఎంత గుండె దౌర్బల్యమూ!

ఒక్క అజ్ఞానులకేగాదు, పెద్దవారై కొంచెము ప్రపంచ జ్ఞానమెరిగినవారలకుఁగూడ నీదయ్యముల నమ్మకము చాలగానున్నది. కాదంటే, వారుకొన్ని గాథలుకూడ చెప్పెదరు. గట్టిగా కోపమొస్తే గుడ్లురుముతారు. "మాకున్నంత అనుభవము నీకుండా ప్రపంచంలో?" అని వాళ్ళంత అనుభవము లేక పోయనా, గుండెనిబ్బరముగా, అతిధైర్యముతో బల్లగుద్ది చెప్పవచ్చును. దయ్యాలు, భూతాలు, అంటూ లేవని, ఇవిమానవ కల్పితములని. ఎక్కువగా మురిగియున్న మురికిగుంటలలోని బొగ్గు పులుసు వాయువు పైకివచ్చి రాత్రులందొకొక్కప్పుడు మంటవలె గాన్పించుచుండును. ఇట్టివానినిజూచి భయపడవలసిన పనిలేదు. భయపడకుండా, ఒకటిరెండు మార్లు ధైర్యముగాఁ బరిశీలించినచో నిది మనకే తెలియగలదు. అనుభవజ్ఞుల మనువారికి యెవరి అహంకారముతోడను బనిలేదు. దీనికి ఊరివెలుపల శ్మశానమందలి మంటలు గూడ నిట్లే గానుపించుచుండును. ఇట్టి లేనిపోని భ్రమలు గల్పించుకొని పరమేశ్వరుఁడిచ్చిన యవకాశము బాడుచేసికొనిన లాభమేమి.?

కొందఱు పుణ్యస్త్రీలు చచ్చిపోయి, వారికి కోరికలు దీరక, అకస్మాత్తుగా మరణించినవారలు, వారియభిప్రాయముల నణచుకొనలేక దయ్యములగుదురని చెప్పెదరు. కాని, అది యంతకంటె నర్థములేని సంగతి. ఏలనన, చనిపోయిన వారలందఱు దయ్యములగుచో నిక నీ ప్రపంచసృష్టి యంతయు నెచ్చటనుండి వచ్చుచున్నది? అదిగాక దయ్యములై వీరిని పట్టుకొనినంతమాత్రాన వారికిఁ గలుగు ప్రయోజనమేమి?

మనమేదైనా పనిఁ జేయుదుమనిన నెందుకు చేయుదుము? ఆనందముకొఱకు. ఆనందము, సుఖములేని పనులనుజేయఁగలమా! అట్టియెడ శరీరమైన లేకుండ, యింకొక శరీరమును బట్టికొనియున్న వీరికిఁగలుగు సుఖమేమి? మరణించినవార లెప్పుడు దయ్యములుగారు. వారి కోరికలు దీరవలయుననిన మరలవారికి

జన్మమే గావలెను. కోరికలుదీరుటకే జన్మల నెత్తుట. చనిపోయినవారలను తప్పకుండ మరల పుట్టుటయే గతి. "జాతస్యహి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్యచ" అనికదా! గీతాచార్యుని వాక్యము.

కావున నట్లు మృతినందినవారలు వారివారి కర్మల ననుభవించి, "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అనువాక్యము ప్రకారము మరల భూమిమీద నుద్భవించి, వారి కోరికలం దీర్చుకొనుచున్నారు.

"గతాను గతికో లోకః నలోకః పారమార్థికః" అనినట్లుగా నడవడమేగాని, ఏదైనా, ఎవరైనా చెప్పిన అది యెంతవరకూ నాచరింపదగినదో యని తెలియుటకుం బ్రయత్నింపము.

నేనిట్లు వ్రాసితినని విజ్ఞులగు విదుషీమణులెవ్వరును కోపగింపకుందురుగాక. మనవారలలో నిట్టి దయ్యముల నమ్మకము పోయినచో చాల సౌఖ్యముగ కాలము గడుపగలమని నానమ్మకము. దీనివలన నెన్నియో అనర్థములు గలుగుచున్నవి. గాన నీమూఢనమ్మకముల నెంతత్వరలో విచ్ఛేదము గావించికొనిన నారీలోకమున కంత శ్రేయస్కరము.

—(o)—

# మద్రాసు నగరంలో పప్పుల రేషనింగు ఏప్రిల్ 8 నుంచి

మద్రాసు నగరంలో కంది, పెసర, సెనగ, మినప పప్పుల (ఇన్ఫార్మల్) రేషనింగు ఏప్రిల్ 8 నుంచి ప్రవేశపెడతారని తెలుస్తున్నది.

పంచదార రేషనుకార్డుమీదనే పప్పులరేషనుకూడా యిస్తారు.

ఈ రేషనింగులో మూడేండ్లపైబడ్డ పిల్లలనుకూడా పెద్దవాళ్ళుగానే లెక్కవేస్తారు.

ఈ రేషను కుటుంబం సంఖ్యనుబట్టి, ఆదాయాన్నిబట్టి ఉంటుంది.

30 రూపాయలు అంతకు తక్కువ నెల ఆదాయం వారికి పెద్దవాళ్ళు ఒక్కరునుంచి ముగ్గురువరకు ఉండేకుటుంబాలకు నెలకు రెండు మద్రాసుపళ్ళు కంది, పెసర, సెనగ, మినపపప్పు యిస్తారు. నల్గురునుంచి ఆర్గురువరకు ఉండే కుటుంబాలకు మూడుపళ్లు. ఆర్గురుపైగా ఉంటే, నాలుగుపళ్లు యిస్తారు.

30 పైగా నూరురూపాయలులోపుగావారికి పైచెల్పిన వరుసను మూడుపళ్లు, నాలుగుపళ్లు, అయిదుపళ్లు యిస్తారు.

నెలకు నూరురూపాయల ఆదాయం పైవారికి పైవరుసను నాలుగు, అయిదు, ఆరుపళ్లు యిస్తారు.

ఈ పప్పులలో యేదైనా నాల్గోవంతువరకు పుచ్చుకోవచ్చు. కందులు, పెసలు, మినుముల విషయంలో గింజలు, పప్పులకు భేదంలేదు. సెనగలు తీసుకోనేవారు పప్పుతీసుకొంటే, రేషనులో ముప్పాతిక వంతే తీసుకోవచ్చు, పిండి తీసుకుంటే, మొత్తం రేషనుక్రింద వచ్చేది తీసుకోవచ్చు.

ప్రభుత్వంవారు పప్పువిషయంలో రేషనింగు ప్రవేశపెట్ట నిర్ణయిస్తూ, నగరానికి వచ్చేవరకు అందరకు న్యాయంగా సమానంగా అందుబాటులో ఉండేటట్లు చేయ నుద్దేశించినట్లు వివరించారు.

# విశ్వదాభిరామ వినుర వేమ

శ్రీ రామమూర్తి చార్యులు గారు.

గులకరాళ్లు తట్టెడుకన్న మంచినీలము ఒక్కటి మేలని; గాడిదపాలు కడివెడుకన్న ఆవుపాలు గరిటెడు మేలని; అప్రాచ్యులు పదిమందికన్న ఉత్తముడు ఒక్కడు మేలని మన వేమన అన్నట్టు; చెత్త చిత్రాలు పదికన్న ఉత్తమచిత్ర మొక్కటిమేలని అనడంలో అతిశయోక్తి ఏమీలేదు.

ఇదిచెత్తది, యిది ఉత్తమమైనది అని చిత్తశుద్ధితో ఆధ్యాత్మిక, మానసిక, భౌతిక రీత్యా గ్రహించిన నాడే, మానవుని జన్మ చరితార్థత మవుతుంది.

ప్రస్తుత కాలమాన పరిస్థితులనుబట్టి 'నేటి సమస్య' చిత్రాలే ఉపయోగకరములు గాని; భక్తి, జ్ఞాన వైరాగ్య చిత్రాలు నిరుపయోగమని మూఢాభిప్రాయముగల యీ రోజుల్లో 'వేమన' లాంటి వేదాంతసార చిత్రం తీయటంలో 'వాహినీ'వారి సాహసాన్ని ఎంతయు కొనియాడదగినది.

కాలమేదైనా, సమస్యలు ఎలాంటివైనా 'మానవుడు చిత్తశుద్ధి గలిగివుండాలి' అనే విషయంలో, అభిప్రాయ భేదాలు వుండవు. చిత్తశుద్ధి కలగడం అనేది ఒక్కసారిగా ఏవ్యక్తికి సులభంగా లభించలేదు, లభించదు.

కొంతమంది పుణ్యపురుషులు చిత్తశుద్ధితో సాహిత్యరీత్యా పోతన; సంగీతరీత్యా త్యాగయ్య, వేదాంతరీత్యా వేమన కృతార్థులయ్యారు. వారి వారి సాధనాలు వేరు వేరయినప్పటికి ఆశయం ఒకటే. అదే మోక్షప్రాప్తి.

మోక్షప్రాప్తి పొందడానికి కొన్ని కొన్ని ఘట్టాలు దాటవలసి వుంటుంది. ఆ ఘట్టాలే బాధ, అనుభవము, పశ్చాత్తాపము, తన్నుదా తెలుసుకోవడము.

కొంతమంది జీవితాలు మొదటి మెట్టులోనూ, మరికొందరు రెండవ మెట్టులోనూ, అలాగే కొందరు మూడవ మెట్టులోనూ, ఆఖరికి ఏకొద్దిమందో ఆ నాలుగో మెట్టులోనూ జన్మ చాలిస్తారు. ఆవిధంగా నాలుగోమెట్టులోకి వచ్చినవారు జనన మరణ రహస్యాల్ని, సత్య అహింసల పవిత్రతను సందేశ రూపకంగా ప్రపంచకానికి యిచ్చి వారు తరించి, మానవుల్ని తరింప జేస్తారు. వాళ్లనే పుణ్యపురుషు లంటారు.

మనకి యీనాటకాలూ, సినీమాలూ ఎలాగో ఆ పరమేశ్వరునికి యీ ప్రపంచమంతా ఒక చిత్రం లాంటిది. ఈ జీవిత రహస్యాన్ని తెలుసుకున్ననాడు మానవుడు తన జీవితాన్ని నిత్యానందంగా గడుపు తాడు. అదే మోక్షం-స్వర్గం.

దాని సారాంశమే యోగి వేమన చిత్రంయొక్క ఆశయం.

వేమన చరిత్ర పూర్తిగా ఎక్కడావున్నట్టు కనబడదు. కొన్ని ఆధారాలు మాత్రమే వున్నాయి. వాటి నాధారంచేసుకుని, కొంత కథ కల్పించి, పండిత పామర జనరంజకంగా వుండేటట్టు 'వాహినీ' వారు 'వేమన' చిత్రం తీశారు.

అన్నగారి యందుగల భయభక్తులు; మోహనాంగి యందుగల వ్యామోహము, అభిరామయ్య నందుగల స్నేహము; వదినగారి యందుగల గౌరవము, జ్యోతియందుగల ప్రేమ చక్కగా ఒప్పించారు:

'ఎంతవారలైనా కాంత దాసులేగదా' అన్నట్టు, వేమన మోహనాంగి వలలోపడి దానికి నగలు, డబ్బు విరజిమ్మాడు. దాని ఫలితం ఎంతవరకూ వెళ్లిందంటే అన్నగారైన అనవేమారెడ్డిని జైలుకి పంపించడం, బంగారు పరిశోధనకై పాట్లుపడడం, జ్యోతిని పొట్టపెట్టుకోడం వరకూను.

యౌవ్వనంలోని శృంగారచేష్టలు, మోహంవల్ల వచ్చిన కష్టాలు; దానిమీద అనుభవము; తర్వాత పశ్చాత్తాపము; ఆఖరికి తన్ను దా తెలుసుకోవడంలోనూ ఒప్పించిన ఈ నటనాచాతుర్యం అంతా శ్రీ నాగయ్య గారి ఉపాసనా ఫలితమే. సందేహంలేదు. ఇక వీరికి పునర్జన్మ వుండదనడంలో అతిశయోక్తిలేదు.

అభిరామయ్య: మహానుభావుల దర్శనమవడమే సామాన్యులకు గొప్ప అదృష్టం. అందులో దర్శన మాత్రమేగాక, వారి అండనుండు భాగ్యము కలుగుట, వారి ఆదరణకు పాత్రులగుట, వారికి స్నేహితు లగుట, ఆఖరికి వారికి శిష్యులగుట పూర్వజన్మ సుకృతము. ఆసామాన్యుడే మన అభిరామయ్య.

ఈ అభిరామ పాత్రను-నటించడం అందామా, లేక, ఒప్పించడం అందామా-శ్రీ లింగమూర్తి గారు అనుభవించి, పోషించారు.

మంచి ఒకరిలో వుంటే సరిపోదు. ఆ మంచిని గ్రహించే మంచి ఎదటివారిలో వున్నప్పుడే ఆ 'మంచి' రాణిస్తుంది. అట్టి గ్రహింపు శక్తిగల అభిరాముడు, వేమన కన్న ఉత్తమోత్తముడు. ఎందుచేత నంటే-వేమన మొదట్లో మోహ పాశాలకి పశుడై అనేకమైన బాధలు పడ్డాడు. రాబోయే విషమ పరిస్థితులు వేమనకి అగమ్యగోచరము లయ్యాయి.

మరి అభిరాముడో- ఆరాబోయే ఆ పదలను తెలుసుకునే చిత్తశుద్ధి మొదట్నించి కలవాడు గాబట్టి, వేమనకి హితబోధ చేసేవాడు. వేమన ఆమాటలను వినని నాడు స్నేహరీత్యా తన ధర్మమును నిర్వర్తించుకుని, స్నేహితునికి అన్నివిధాలా తోడ్పడేవాడు. ఎన్నో కష్టాలను గట్టెక్కించాడు.

ఇతరుల కష్టాలను గట్టెక్కించాడేగాని, ఆకష్టాల రహస్యాన్ని ఆధ్యాత్మికరీత్యా అవగాహన చేసుకోడానికి అవకాశం లేకపోయింది.

గట్టెక్కించేవాని ఆసరా చూచుకుని వేమన ఆజీవిత రహస్యాన్ని సాధించాడు.

ఇక-అభిరామయ్య ఎంతసేపూ తన జీవితాన్ని స్నేహితుడైన వేమనకే అంకితం చేసాడు.

ఈ అభిరాముని వలననే మనకి వేమన సందేశం లభించింది.

వేమన సాన్నిధ్యమే అభిరామునకు పరమావధి అనడంలో అతిశయోక్తిలేదు.

నాట్యం: దేవాలయాల్లో భగవత్సాన్నిధ్యమున ప్రభాతసేవ, పవళింపుసేవ, మొదలైనవి ఆధ్యాత్మిక దృష్టితో నాట్యంచేసి జన్మ తరిద్దామనుకునే స్త్రీలనే దేవదాసీలంటారు. ఈచిత్రంలో మోహనాంగి దేవదాసీగానే పరిగణించారు. అయితే ఆపెచే చేయించిన నాట్యం సమయోచితంగా లేదనడానికి సాహసిస్తున్నాను.

ఆధ్యాత్మిక చింతయే పరమావధిగా వున్న నృత్యగీతాలూ లేకపోలేదు; అట్టి గీతాల్ని అర్థంచేసుకుని, ఆచరించి, ఆచరింపజేసే నర్తకులూ లేకపోలేరు.

శ్రీ వేదాంతం రాఘవయ్యగారికి శాస్త్రీయమైన, ప్రాచీన సాంప్రదాయసిద్ధమైన నాట్యశాస్త్రము తెలుసు. దాని ఆచరణ విధానమునందు వారు సిద్ధహస్తులు.

వేమన నాటికాలము, పరిస్థితి తెలుసుకొనికూడ, వారు యిటువంటి పద్ధతిలో నాట్యం జరిపించారూ అంటే ఆశ్చర్యంగా వుంది.

శాస్త్రీయంగానూ, ప్రాచీన సాంప్రదాయాన్ని ఆచరిస్తే నాట్యం ఒప్పదనా? లేక యిప్పటివారు అర్థంచేసుకుని ఆనందించలేరనా?

వేదాంత సారాన్ని, జీవిత రహస్యాన్ని, జనన మరణ సమస్యని అర్థంచేసుకోగల ప్రజ వున్నారని తెలుసుకుని 'వాహిని' వారు 'వేమన' చిత్రాన్ని తీసి, ప్రదర్శిస్తుంటే; వీరి నాట్య సాంప్రదాయాన్ని అర్థంచేసుకుని ఆనందించేవారు లేరనా.?

ఇతర నటీ నటవర్గము ఉపకరణములుగా నిల్చి కడుసమర్థతతో వారి వారి పాత్రలను నిర్వహించి చిత్రాన్ని 'భేష్' అనిపించారు.

వేదాంతసారాన్ని మధురమైన భాషలో సుబోధకంగా వ్రాసిన శ్రీమాన్ రాఘవాచార్య కవిగారు ప్రశంసనీయులు. చిత్రాలకు అనుగుణమైన భాషను చిత్రించడంలో వీరిదే అగ్రతాంబూలమని చెప్పవచ్చు.

భక్తి, జ్ఞాన, వైరాగ్య జ్యోతులను ప్రజలకు అందజేసి, ప్రజలను పాపరహితుల్నిగాజేసి, జ్ఞానోదయం కలిగించే చిత్రాన్ని తీసిన దర్శకులు శ్రీ కే. వి. రెడ్డి, కె. కామేశ్వరరావుగార్లు ధన్యులు.

ఎంత ఆధ్యాత్మిక దృష్టితో సాహసించి యిట్టి చిత్రాన్ని నిర్మించినా, ఆర్థిక రీత్యాకూడా చూడవలసిన ఆవశ్యకతనుబట్టి సామాన్య ఆకర్షణలకై అక్కడక్కడ కొన్ని స్టంట్సు, పాశ్చాత్య నాట్య పోకడలు, మ్యాజిక్ ఘట్టాలు ప్రవేశపెట్టవలసి వచ్చిందనుకుంటాను.

మొత్తంమీద బడులలోనే వున్న-చిన్నప్పుడు చిన్నక్లాసుల్లో చదువుకునేవాళ్లం-వేమనను దేశ దేశాల, ఊరూర, యింటింట, అందరికీ సందర్శ సందేశ సౌభాగ్యాన్ని కలిగించిన 'వాహినీ' వారికి అభినందనములు.

"పురుషులందు-పుణ్య పురుషులు వేఱయా
విశ్వదాభిరామ వినుర వేమ"

—:o:—



సేలంజిల్లాలో చిన్నప్పయ్యర్ అనే అతడు శ్యామకల్ అనేపడుచును 6 సం॥క్రిందట వివాహమాడినాడు. 3 సం॥లు కాపురం చేశారు. తర్వాత అతనితో కాపురంచేయలేక ఆపిల్ల పుట్టింటికి పోయింది. అతడు తిరిగీ పెండ్లాడినాడు. ఆపిల్ల శ్యామకల్ భరణానికి దావా వేసింది జిల్లామున్సబు రు 5-0-0 లు తీర్పు ఇచ్చాడు. చిన్నప్పయ్యర్ జిల్లాజడ్జి కోర్టులో అప్పీలుచేశాడు. జిల్లాజడ్జి శ్రీచలసాని సత్యనారాయణ చౌదరిగారు అప్పీలుకొట్టేస్తూ ఇట్లా తీర్పులోవ్రాశారు:

భార్యతనవద్దనే పడిఉండి కాపురం చేయాలిగదా, తానే ఆమెను దిక్కుగదా-అని ఆమెను అతడు నిర్లక్ష్యంచేయరాదు, భర్తవద్దఉండి అతనితో కాపురం చేయువలెను, అని ఆమెను కులాసాపుట్టేటుగా తగిన జీవిత పరిస్థితులను, మంచిఅనుకూలమైనవాటిని ఆకర్షణీయంగా అతడు కల్పించితీరాలి. అదిఅతని ధర్మం అట్లాన్యాయముగా సవ్యమైన జీవితపరిస్థితులను భార్యకతడు కల్పింపజాలనిరోజున, ఆమె అతనితో నివసింప నిరాకరిస్తే ఆమెను ప్రత్యేకంగా కాపురముండ గల్గుటకై భరణమివ్వక తప్పించుకోజాలడు.

♦ ♦ ♦

ఆసియామహాసభకు విచ్చేసిన రష్యా ప్రతినిధులలో జార్జియర్ రిపబ్లిక్ ప్రతినిధి అలహాబాదు విశ్వవిద్యాలయాధ్యాపకులకు, విద్యార్థులకు ఉపన్యసిస్తు రష్యాలో సోవియట్ వారియువజన విద్యావిధానాన్ని గూర్చి ఇట్లుచెప్పినాడు:

సోవియట్ యూనియన్‌లో విద్యావిధానము సమూహంమీద జరుగుతుంది. మాకు800-వివిధ ఉన్నత విద్యాలయాలు అక్కడ ఉన్నవి. వానిలో 9000-విద్యార్థులున్నారు. వీరిలో 100 కి 42 స్త్రీలు. ఈ పాఠశాలలకు తోడు సైన్సుపాఠశాలలున్నూ - విరివిగాఉన్నవి. వీటిలోతయారైనవారే, హిట్లరును జయించిన యుద్ధంలో యుద్ధపు పనులకెంతో తోడ్పడ్డారు.

♦ ♦ ♦

ఈ మాసారంభంలో బళ్లారినగరంలో శ్రీ ప్రొ. ఆర్. వి. జాగీర్‌దారుగారి అధ్యక్షతక్రింద కీ. శే. నాట్యకళాప్రపూర్ణ టి. రాఘవాచార్యులుగారి ప్రథమ సాంవత్సరికం జరిగింది. అధ్యక్షులిట్లని శ్రీ రాఘవగారిని ప్రశంసించారు:—

శ్రీ రాఘవాచారిగారు నాట్యకళయందు విప్లవం కలిగించారు. భరతశాస్త్ర ప్రకారం స్త్రీ పాత్రలను స్త్రీలే వహించాలని పట్టుదలతో కృషిచేసి అనేక స్త్రీలను నాటకరంగానికి తెచ్చారు.

శ్రీ రాఘవగారు ధనార్జనమే ముఖ్యంగా భావించుకున్నట్లయితే, న్యాయవాది వృత్తియందే కాక, నాట్యకళ ద్వారాకూడ అనేక లక్షల సంపాదించేవారు. అట్టి గొప్ప కళారాధకుని, కళోద్ధారకుని జ్ఞాపకార్థం రెండు లక్షల రూపాయలు వసూలుచేసి దివ్యమైన నాటకశాలను కట్టించడం బళ్లారి పురవాసుల కర్తవ్యం. అప్పుడుగాని శ్రీ రాఘవగారి ఆత్మకు శాంతి లభించదు.

♦ ♦ ♦

అఖిలభారత ముస్లింలీగు మహిళా ఉపసంఘము మూడురోజులు చర్చించి ఈ మాసారంభమున తేల్చినసారాంశము:—

మేమొక్కరమే భారతముస్లిం స్త్రీలకుప్రాతినిధ్యము వహించు సంఘము అనియు, అఖిలభారత మహిళామహాసభవారు తాముస్త్రీలందరికి ప్రాతినిధ్యం వహింతుమనుట కల్లఅనియు, అదికేవల మొక్క హిందూసంస్థఅనియు ఈఉపసంఘమువారు మరొక్కసారి ఉద్ఘాటిస్తున్నారు.

♦ ♦ ♦

కడపలో స్త్రీ ఉద్యమ నాయకత్వము వహించి నడుపుచున్న శ్రీమతి బి. కోటమ్మగారు నూతన మదరాసుమంత్రివర్గమున స్త్రీ మంత్రిణిగా నియమింపబడకపోవుటను గూర్చి మెయిలుపత్రిక కిట్లువ్రాసియున్నారు:

దేశమంతటా స్త్రీకి ప్రాముఖ్యతఇచ్చి సర్వవిధములా ఆమెను ప్రోత్సహిస్తుండగా మద్రాసు నూతనమంత్రివర్గంలో స్త్రీని మంత్రిణిగా నియమింపకపోవడం విషాదకరము. ఇప్పటికైనామించిపోయింది ఏమిన్నిలేదు. క్రొత్తనాయకుడు అవసరమని తలిస్తే స్త్రీని మంత్రిణిగా నియమించవచ్చు; లేనిచో రాష్ట్రంలో స్త్రీసమస్యలు మూలబడతవేమో ?

♦ ♦ ♦

ఢిల్లీ మునిసిపాలిటీవారు క్రొత్తవైస్‌రాయి దంపతులకు వినతిపత్రమును సమర్పించిన సమయాన మౌంట్‌బాటన్ ప్రభువు తనధర్మపత్ని భవిష్యత్కార్య క్రమమును గూర్చి ఇట్లుచెప్పినాడు:—

భారత సైన్యములో రోగుల కుపచారంచేసే శాఖవారు మున్నగువారితో ఇటీవల కొన్ని సంవత్సరాల నుంచీ మౌంట్‌బాటన్ ప్రభ్వికి కొంత పరిచయంకలదు. ఆమెయింకా వైద్యసంఘాలతో, శిశు సంరక్షక సంఘాలతో కలిసి పనిచేయ వలయుననియే తలచుచున్నది.



'వేమనలో' నాగయ్య



నాగయ్య-లింగమూర్తి 'వేమనలో'



శ్రీమతి రాజమ్మ "వేమనలో"

ఆహార పదార్థములలో కల్తీ, దానివల్ల బాధలు ప్రతిఇల్లాలికి విసుగెత్తించే విషయాలుగదా. దీనినిగూర్చి కేంద్ర ప్రభుత్వపుటాహార శాఖా మంత్రి రాజేంద్ర ప్రసాద్‌గారు ఆహార వస్తుప్రదర్శన మారంభిస్తూ ఢిల్లీలో ఇట్లని చెప్పినారు:

ఈకల్తీ చేయడం ఒక కళగామారిపోయింది; కల్తీచేయడానికి వీలులేని వస్తువే కన్పించడంలేదు. ధాన్యంగూడకల్తీ అవుతున్నది-బియ్యంలో ఒకవిధమైన తెల్లటి రాళ్లుకలుపుతారట. బియ్యానికి వాటికిభేదముండదు. అందుచేత పంటి క్రిందికివచ్చి మెత్తటి అన్నంవలె కొరకబడక ప్రాణంకటకట పడితేనేగాని తెలీదు. ఇక ధాన్యపుపిండ్లలో అనేకవిధములైన పొడులు, కలపడం ఆశ్చర్యకరముకాదు. గోధుమలలో కూడా అనేక రకముల ధాన్యాలను తెలుసుకోడానికి వీలులేకుండా కలుపుతారట; అవిగోధుమలమాదిరి బలకరమైన అహారం మాత్రము కాదు. పాలు, నూనె, నెయ్యికల్తీచేయడం లోకప్రసిద్ధము. ఈకల్తీచేయడం ఆటంక పరచడమే నేడుకావలసిన ముఖ్యమైనపని.

♦ ♦ ♦

లేక్ సక్ సెస్ [న్యూయార్కు-న]నందు" సమష్టిరాజ్య సమితి ఆర్థికసాంఘిక సంఘంలో స్త్రీలు యిదివరకెన్నడూ ప్రసంగించలేదు ఈమె ప్రథమురాలు" అనిప్రకటించగా భారత ప్రతినిధి శ్రీమతి హన్సామెహతా లేచినది. సభ్యులు ప్రకటించిన హర్షానికి మేరలేదు. ఆమె ఇట్లా మాట్లాడినది:-

సమిష్టిరాజ్య సమితికి స్త్రీలను ప్రతినిధులుగా పంపినందులకు భారత ప్రభుత్వాన్ని నేనభినందిస్తున్నాను. ఇతర ప్రభుత్వాలుకూడా వారిననుసరిస్తే బాగుండును. పొట్టఆత్రంకోసం వ్యభిచార వృత్తిలో ప్రవేశించటం అలావుంచండి. అనేకదేశాలలో సైనికాధికారులు బుద్ధిపూర్వంగా వ్యభిచారాల్ని ప్రోత్సహిస్తున్నారు. యుద్ధ సమయంలో మాదేశంలో జరిగిన కొన్నికథలు విని మేము తబ్బిబ్బులైనాము. ఇక ముందెన్నడూ మిలటరీ అధికారులు ఇలాంటి దుష్ట వ్యాపారాన్ని ప్రోత్సహించ కుండుటకు తగిన కట్టుదిట్టాలు చేయమని యీ సభవారిని కోరుతున్నాను.

♦ ♦ ♦

సోవియట్ యువతి వోల్గా ప్రపంచ యువజన సమితి రాయబారివర్గ సభ్యురాలు. ఈమె యీనెల 21 వ తేదిని బెజవాడ వచ్చినది. ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘంవారు రాయబారివర్గం వారికి తేనీటివిందుచేసి గౌరవించారు. ఆసందర్భంలో భారతస్త్రీలను ఉద్దేశించి శ్రీమతి వోల్గా యీాదిగువ సందేశాన్ని యిచ్చింది: —

"నేను ప్రపంచయువజన సమితియొక్క యీసంస్థలో ప్రాతినిధ్యంగల 63 దేశాల యువతుల సందేశం మీకందజేస్తున్నాను. రష్యా, యుగోస్లావియా మొదలైన కొన్నిదేశాలలో తప్ప, స్త్రీలు పురుషులతో పాటు, సమానంగా పరిగణింపబడుటలేదు. ముఖ్యంగా హిందూదేశంలో నేను పర్యటనం సల్పిన యీ కొద్ది

రోజులలో, స్త్రీలు విద్యలోను, సంఘసమానత్వంలోను, ఆర్థికంగాను చాలవెనుకబడి దుర్భరమైన జీవితాలను గడుపుచున్నారని తెలుసుకున్నాను. టీతోటల్లో స్త్రీలు తమ పిల్లలను వీపున కట్టుకొని రోజుకు 9 గంటలు పనిచేస్తున్నప్పటికీ పురుషులతో సమానమైన కూలిలేదు. ఇచ్చే కూలైనా స్వల్పము. 5-6 సం|| వయస్సుగల పిల్లలు తమజీవిత భృతికోసం కష్టపడి, పెద్దవారి వలె పనిచేయడము చూచి చాల విచారించాను. మీ దేశంలోని యువతులందరు పురుషులతో సమానత్వంపొందాలంటే, మీకష్టాలన్నీ పోవాలంటే, మీదేశ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనాలి. మీరందరు ఐక్యతగా, దేశస్వాతంత్ర్య పోరాటాన్ని నడిపితేగాని, మీకు గాని, మీపిల్లల భవిష్యత్ జీవితానికిగాని, సంతోషము, అభ్యున్నతి గూర్చలేరు. ప్రపంచయువతీ యువకులు, మీకు యీస్వతంత్రపోరాటంలో అండగా ఉంటారని వాగ్దానం చేస్తున్నాము.

♦ ♦ ♦

దేశానికి త్యాగం చేసినవారి కుటుంబాలకు సహాయంగా మద్రాసు ప్రభుత్వ విరాళాలు:—

1941 సత్యాగ్రహంలోను, 1942 ఉద్యమంలోను ప్రాణత్యాగంచేసిన దేశసేవకుల కుటుంబాలకు అర్హతవున్న పక్షంలో, ఆర్థికసహాయం చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

ఈ సందర్భములో, చెంగల్‌పట్టు నివాసి, నటరాజయ్యర్‌గారి కుటుంబానికి రూ. 3000 లు యివ్వ నిశ్చయించారు. 1942 నాటి ఉద్యమంలో నటరాజయ్యరును జైలులో పెట్టారు. జైలులోనే ఆయనకు జ్వరం వచ్చింది. ఆ తర్వాత ఆయనను విడుదలచేశారుగాని, మర్నాడే మరణించారు.

దక్షిణ ఆర్కాటు ముత్తురంగపిళ్లెగారిపై ఆధారపడియున్న శ్రీమతి అపరూపమ్మాళ్‌కు రు. 300లు యివ్వ నిశ్చయించారు. ముత్తురంగపిళ్లెగారు 1941 లో జైలులో మరణించారు. కోయంబత్తూరు రంగస్వామి నాయుడుగారికికూడ రు. 1000 లు యివ్వబడుతాయి. ఆయన కుమారుడు 1942 ఉద్యమంలో జైలులో మరణించాడు. భీమవరం తాలూకాలోని, కుముదవల్లిపల్లెకు చెందిన రుద్రరాజు వెంకటరాజుగారి భార్యకు, అయిదుగురు పిల్లలకు 2000 రూపాయలు విరాళం యివ్వబడుతుంది.

1942 ఆగస్టు 17 తేదీన రుద్రరాజుగారు భీమవరంలో రాజకీయసభకి వెళ్ళగా, అక్కడ పోలీసు కాల్పులలో దెబ్బతిని మరణించారు. జీవనాధారంకోసం ధనంగాని, భూమిగాని యివ్వమని ఆయనభార్య ప్రభుత్వానికి దరఖాస్తుపెట్టింది. ఈ కుటుంబానికి ఏ విధమైన ఆస్తిలేదని జిల్లా మేజిస్ట్రేటు తెలియజేశాడు. న్యాయప్రకారం ఎట్టి నష్టపరిహారం యివ్వ నవసరం లేకపోయినా, ప్రభుత్వం దయదలచి రు 2,000 లు యివ్వ నిశ్చయించింది. పశ్చిమ గోదావరి జిల్లా, వేగేసిన నారాయణ రాజుకూడా యిటువంటి సందర్భాల లోనే మరణించి నందువల్ల, ఆయన భార్యకి రూ. 1,000. దేవకోట ధర్మరాజన్, యిటువంటి సందర్భాల లోనే మరణించి నందుకు ఆయన భార్యకి రూ. 500 యివ్వ ప్రభుత్వం నిశ్చయించింది.




## ప్రపంచలో ఆకలి గొన్న బాలబాలికలు సంరక్షణ ప్రయత్నము.

యుద్ధం మూలాన ప్రపంచంయొక్క ఆర్థికవ్యవస్థ తారుమారైపోయింది. అన్నవస్త్రాలకే లోటు ఏర్పడినది. ఈ కాటకంచేత అర్థాకలితో నకనకలాడుతున్న బాలబాలికలు 2,00,00,000 మంది అని ఆర్థికవేత్తలు అంచనా వేశారు. వీళ్లలా అల్లాడి పోతుంటే నాగరిక ప్రపంచం చూస్తు ఊరుకోవలసిందేనా? ఊఁ హూఁ; కాదు. మిత్రరాజ్య సమితివారు ఆలోచించినారు. ప్రపంచంలోగల కార్మికులైన స్త్రీ పురుషుల నందరిని ఒక్కరోజు భత్యం ఇమ్మని కోరుదాము – అని నిర్ణయించు కున్నారు. ఈ విధంగా 20,00,00,000 డాలర్లు వసూలౌతాయని అంచనా. దీనితో ఆ బాలబాలికల కొక్క సంవత్సరం పుష్కలంగా బువ్వపెట్టవచ్చునట. ఏ రోజున ఈ వసూలు చేయడమో మిత్రరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి ట్రిగ్వేలీ గారు నిర్ణయిస్తారుట. ప్రపంచంలో కార్మికులుగాని స్త్రీ పురుషు లెవ్వరో? రోడ్డుమీద నిల్చి గునపంతో త్రవ్వేవాడు, ఆఫీసులో పంకాకింద కూర్చొని రైటుచేసే పడుచు, గ్రామాలవెంట వెళ్లి అజమాయిషీ చేసే తాహసీలుదారు, భర్తకు బిడ్డలకు అన్నం వండిపెట్టి గుడ్డలు ఉతికి, ఉపచారాలు చేసే ఇల్లాలు, వడ్డీలమీద వడ్డీలుపెంచి పత్రాలు తిరుగ వ్రాయించుకుంటూ లెక్కలు వ్రాసుకొనే షాహుకారు-అందరూ కార్మికులే. ఏ కృషీ చేయకుండా కూడూ గుడ్డా అమిరేవాళ్లు, రోగులు, వికలాంగులు, వృద్ధులు, జమీందార్లు, రాజులు, రాణులు-ఏ కొలది మందో! అయితే కొందరికూలి తగు మాత్రం; మరి కొందరి కది మితిమీరినది. దీనిని సర్దుబాటు చేయడానికే సాంఘికవాదులు, ఆర్థికవేత్తలు, రాజకీయాందోళకులు కృషిచేస్తున్నారు. అది అట్లుండనిచ్చి-ఎవరో కొందరు కార్మికులు, తాముకాదు అని ఎవ్వరూ తలంచక, తనభుక్తికి, తనబట్టకు అంతో, ఇంతో నిత్యమూ కృషిచేస్తున్నామనుకోవడం గౌరవంగా భావించి-ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడున్నూ ఒకనాటి తన సంపాద్యాన్ని న్యాయంగా, హృదయపూర్వకంగా పైనిధి కిచ్చినట్లైతే,-20 కోట్ల డాలర్లే కాదు; 200 కోట్ల డాలర్లైనా కాగలదని మా విశ్వాసము. బాలా త్రిపుర సుందరిని, బాలగోపాల కృష్ణుని ఆరాధించుట కన్నా ఆనందదాయకమే మున్నది? ప్రపంచలో నేడు ఆకలిగొన్న బాలబాలికలకు ఒక రోజు భత్యమిచ్చి-ఆకలిబాపుట-అంతకన్నా వేరెట్లగును?

## చాకలి సోడా

చాకలి సోడాకు కంట్రోలు ధర కలదు; కాని రేషనింగులేదు. కాబట్టి కంట్రోలు ధర వీశ 1 కి రు 0-5-0 లు అయితే రు 2-0-0 బ్లాకు మార్కెట్టు ధరకు అమ్మబడుతున్నది. అనిన్నీ-తెఖలలో మాత్రము ఇతర కులాలవారిపేర్ల - ఖర్చులు మాత్రం వ్రాస్తారనీ-ఆంధ్రరాష్ట్ర రజకజనసంఘప్రధాన కార్యదర్శి

శ్రీలంక పేరయ్యగారు పత్రికలలో వ్రాస్తున్నారు. రజకులమాట అట్లుంచి గృహలక్ష్ములకును సంబంధించిన సమస్యయే ఇది. ప్రతి ఇల్లాలునూ తనభర్తకు బిడ్డలకు తగు మాత్రమైన చాకిపని చేయవలసియున్నది. నాగరిక స్త్రీలు, గుడ్డలసబ్బు, సోడాల సహాయంతో, శ్రమ విశేషంలేకుండా గుడ్డలుతుక్కుంటారు. కాబట్టి ప్రతి యింటా అత్యవసరమైన ఈ సోడాను కూడా రేషన్ ప్రకారము, బియ్యపు చీటీ మీదనో, చక్కెర చీటీమీదనో, ఇంత అని ఇచ్చే ఏర్పాటు ప్రభుత్వము చూడవలసి యున్నది.

## బాలబాలికలకు చలన చిత్రాలు.

బ్రిటన్ అమెరికా, రష్యా మొదలైన దేశాలలో ప్రత్యేకంగా బాలబాలికలకు ఉల్లాసకరంగాను ఉద్బోధకరంగాను ఉండే కొన్ని చలన చిత్రాలు తీస్తున్నారు. మన దేశంలో ఇంకా అలాంటి ప్రయత్నం చేసిన పురుషుడు కన్పించడు. ఇప్పటికి వెలిసినవి సాంఘికం, పౌరాణికం, ఇప్పడిప్పడు - చారిత్రకం. సాంఘికం ఎంతవరకు పెండ్లి, పెండ్లి, పెండ్లి - ఆగిరి దాటదు. పౌరాణికం ప్రజలలో మూఢ విశ్వాసాన్ని పెంపొందించడానికేగాని - నూతన వ్యాఖ్యానం చేశేవి కన్పించవు. చారిత్రకం - కూడా అంతంత మాత్రంగానే ఉన్నవి. వీనిలో దేనిలో కూడా 'కాల మర్యాద' గమనించిన పాపాన ఎవరూ పోవడంలేదు. 'గానం' యొక్క సందర్భశుద్ధి, పాటించడం చాలా అరుదు. సాంఘికములలో - ఔచిత్యపు మేరలు ఇంకా నిర్ణయం కాలేదు. ఇక వీరెన్నడు వీటి నన్నిటినీ అధిగమించి - ప్రజలకుద్బోధకరమగు - కేవలము వినోదకరముగానివి - చిత్రములు తీస్తారో, వానిలో ముఖ్యముగా బాలబాలికల కుపయుక్తమయ్యే చిత్రములకు ప్రయత్నిస్తారో పరమేశ్వరుని కెరుక. కాని త్వరగా చేయదగ్గది అని మాత్రం మేము హెచ్చరిస్తున్నాము.

## దేశానికై త్యాగంచేసిన వారి కుటుంబాలకు సహాయం.

మద్రాసు ప్రభుత్వంవారు ఈసారిచేసిన ఉత్కృష్టమైన కార్యములలో - ఈ 25 సం॥ లుగా దేశానికై పలువిధములైన త్యాగములుచేసి విగతజీవులైనవారి కుటుంబాలు-నిరాధారంగా అల్లాడవలసిన అగత్యం లేకుండా వారికి ధనసహాయం చేయడం - ప్రశంసార్హమైనది. ప్రసిద్ధులైన ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి కుటుంబమునకు ప్రభుత్వోద్యోగంలో నుండిన శ్రీ కల్నల్. (అప్పట్లో కెప్టన్) శంకరశాస్త్రి గారు మిత్రులవద్ద వసూలుచేసిందే ఆధారమైంది. డా॥ సుబ్రహ్మణ్యంగారి కుటుంబమునకు వారి మిత్రులు శ్రీ కాంగ్రేసుల జమీందారుగారి, ఔదార్యమున్నూ, ఆత్మ బంధువుల ఆదరణయున్నూ మాత్రమే ఆధారము అయినది. మంత్రిగానుండిమరణించిన శ్రీ రాముని మీనన్ గారి కుటుంబమును కడగండ్ల పాలాయెనని విందుము. ప్రసిద్ధులైన వారి స్థితే అట్లుండగా అప్రసిద్ధులు అయినను సత్ప్రప్రస్తునివలె - త్యాగ శీలము మిన్ను ముట్టిన వారెందరి కుటుంబములో వగుడాకులవలె గాలిలో ఎగిరిపోయినవి. నేడు మద్రాసు ప్రభుత్వమువారి వల్ల సాయము పొందినవారి వివరం వేరే ఇచ్చియున్నాము. వీరుగాక నింక నెందరో ఆర్తులున్నారు. వారందరు ఆదరణీయులు. అది ప్రకాశం మంత్రివర్గముగాని, రెడ్డియారు ప్రభుత్వమువారు గాని - అట్టి వారిని వెతికి తెలిసి ఆదరించుట - వారికి ముఖ్య కర్తవ్యమని మా అభిప్రాయము.

## కాంగ్రెస్ అసెంబ్లీకి ఆంధ్ర మహాసభ రాయబారవర్గం.

మద్రాసులో ఈ మాసారంభమున జరిగిన ప్రత్యేకాంధ్ర మహాసభవారు గావించిన "ఆంధ్రరాష్ట్ర నిర్మాణ" పు తీర్మానాన్ని స్వయంగా ఢిల్లీలో కాంగ్రెస్ అసెంబ్లీ అధికార్లకు అందజేయను, వారందరికి ఈ విషయమై తగు సంజాయిషీ చెప్పి వత్తిడిచేయను ఒక రాయబారవర్గం వెళ్లుచున్నది. వీరిలో ఒక స్త్రీ

కూడా లేకపోవడం చింతాకరము. నిజానికి శాసనసభా చర్చలు, రాజ్యాంగ వ్యవహారాలు మాతృభాషలో జరిపించడానికే, మనకు ప్రత్యేకాంధ్ర రాష్ట్రము. నేటి అస్సెంబ్లీ స్పీకరు శాసనసభలో ఒకరు మాట్లాడేది మరొకరికి అర్థమయ్యేట్లు చేయను పడుతున్న బాధ మీరు పత్రికలలో చూస్తునేయున్నారు. ఈ అర్థంగాని బాధ హెచ్చుగా స్త్రీలకే. శాసనసభలలో కొన్ని స్థానాలు స్త్రీలకు ప్రత్యేకింపబడియున్నా, జనరల్ స్థానాలుకూడా వారు పొందవచ్చు. ఆంధ్రదేశంలో ఇప్పటికే యిద్దరట్లా ఎన్నుకోబడియున్నారు. జనాభాలో సగమైన స్త్రీలకు న్యాయంగా సగం శాసనసభా స్థానము లాక్రమించచు సంపూర్ణమైన హక్కున్నది. అట్లా ఏర్పడ్డనాడు స్త్రీల పురోభివృద్ధి చాలా ముందుకు సాగిందనవచ్చు. అట్టి అవకాశాన్నిచ్చే భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనకుగూర్చి తెలియజెప్పి, వత్తిడి చేయడానికి వెళ్లే రాయబారవర్గంలో స్త్రీ ఒక్కతె అయినా లేకపోవడం చాలా లోటు. ఇప్పటికైనా చేర్చుకోవచ్చు.

## కీ॥ శే॥ బీగం మహమ్మదాలీ

కాకినాడ కాంగ్రెసున కధ్యక్షత వహించిన కీ॥ శే॥ మౌలానా మహమ్మదాలీగారి సతి గత మాసాంతమున కీర్తిశేషురాలైనదని వినుట కెంతయు చింతిలుచున్నాము. ఆమె భర్తతోపాటు ఖిలాఫత్, కాంగ్రెసు ఉద్యమములలో కృషిచేసి, పిదప ముస్లింలీగులో పనిచేసి ముఖ్యురాలైనది. ముస్లింలీగు కార్యనిర్వాహక వర్గ సభ్యులుకూడ. జిన్నా ఆమె మరణమువల్ల ముస్లింలీగు గొప్ప సలహాదారును గోల్పోయెనని వగచుచున్నాడు. ఆమె రాజకీయములతో మాకు పనిలేదు; మేమేకీభవింపముకూడ. అయితే, పరదాచాటున కూర్చుండి ప్రపంచమును చూడని ముసల్మాన్ల యువతి అయ్యు, సుమారొక 30, 40 సం॥ లుగా దేశసేవ, సంఘసేవ గావించిన నారీరత్నమగుటచే మాకు మాననీయురాలు. నారీ లోక మంతటికిని సమ్మాననీయురాలనియే మా అభిప్రాయము. ఆమె ఆత్మకు అల్లా శాంతి యొసంగుగాత.

## బిడ్డల ఆహారము: మందులు: కంట్రోలు :

బిడ్డల ఆహారములు, గ్లాక్సోమున్నగు నవి చాలవరకు విదేశములనుండి వచ్చుచున్నవి. ఇవి సౌకర్యముగా మందుల షాపులవారి చేతనే విక్రయింప బడుచుండును. ఆరోగ్యశాఖా సమ్మతమైనవే బహిరంగవిక్రయ మగుట న్యాయముకూడా. అయితే వీనినాహార పదార్థములుగా పరిగణించుట సబబుగాని మందులక్రింద జమకట్టుటసరికాదు. కాని ప్రభుత్వ మట్లు గావించుటలేదు. ప్రకాశంగారి ప్రభుత్వపురోజులలోనే మందులపై యుద్ధకాలపు కంట్రోలు తీసివేయబడినది. దానితోపాటు బిడ్డల ఆహార పదార్థములపైకూడ కంట్రోలు తొలిగినది. ఆఅవకాశముగైకొని ఆరెంటిధరలు మిన్నుముట్టినవి. రు 2-13-6 కు ఇవ్వబడుచుండిన గ్లాక్సో పౌనుడబ్బా నేడు రు 5-6-0 అమ్ముచున్నది. హార్లిక్స్, గ్లూకోస్ మున్నగునవికూడా అట్లే అమ్మబడుచున్నవి. మందులసంగతి చెప్పనక్కరలేదు. రోగులకు బిడ్డలకు అత్యవసరమై మందులు ఆహార పదార్థములు మితిమీరిన ధరలకు విక్రయింపబడు అవకాశమును, ప్రజాభిప్రాయమును కాణాచిగాగల శ్రీ ప్రకాశం పంతులుగారేల చేసిరో దురూహ్యము. క్రొత్తమంత్రులును దీనిని పరికింపకపోలేదు. శాసనసభలో ప్రశ్నింపగా ఆహారమంత్రి శ్రీ డా. రాజన్ గారు తాము దానిని గమనించితి మన్నారు, శ్రీ సీతారామరెడ్డిగారు- ఈధరల హెచ్చింపు, మొత్తముపై కంట్రోళ్లు తొలగించుటకు ప్రోత్సాహకరముగ లేదు అన్నారు. కావున మంత్రివర్గము ఒక వారము రోజులు ఆయావానిని విక్రయించువారికి గడువునిచ్చి ఈలోపలధరలు సక్రమముగా తగ్గనిచో, పూర్వపు కంట్రోలు ధరలమేరకు దిగనిచో, తిరిగి వీనిపైకంట్రోలు ధరలనమలు జరుపుట అత్యవసరమని, మేముభావించుచున్నాము. పసిబిడ్డలను, రోగపీడితులను ఆదరించని ప్రభుత్వమును 'ప్రభుత్వము' అన జెల్లదు.

# ★ సమకాలిక పత్రికలు మా కొసగిన స్వాగతము. ★



గతించిన పాదశతాబ్దంలో మన ఆంధ్రాభ్యుదయానికి కృషిచేసిన పవిత్రశక్తులలో అందున, ఆంధ్ర నారీలోకం ఉన్నత పథాలననుగమించడానికి దోహదమిచ్చిన వివిధశక్తులలో 'గృహలక్ష్మి' పత్రిక నిర్వహించినపాత్ర అద్వితీయమైనది. సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా స్త్రీలలో, శక్తియుక్తులను ప్రబోధించడానికేకాక స్త్రీజనపరమైన ధర్మాలను హక్కులను శాసించడానికి కూడా 'గృహలక్ష్మి' ఒక బలమైన ఉపకరణ అయింది. ఏటేటా ఒక విదుషీమణిని స్వర్ణకంకణముతో సన్మానిస్తూ, గృహలక్ష్మి జనకులు శ్రీ కేసరి మహోదయులు స్త్రీలకు సారస్వత, కళాప్రోత్సాహాలను కలుగజేస్తూ మిక్కిలిగా తోడ్పడినారు. కాని యుద్ధమూలముగా 1942 లో గృహలక్ష్మి నిలిచిపోయి నందువల్ల స్త్రీల 'వాణి' కొంతవరకు కనుమరుగుగాక తప్పలేదు. యుద్ధంముగిసి సమస్తరంగాలలోను పునర్నిర్మాణోద్యమా మొలకెత్తుతూవున్న ఈ తరుణంలో గృహలక్ష్మి తిరిగి కార్యరంగంలో కాలిడడం ఉత్సాహ జనకంగా వున్నది. యథారీతిని ఆంధ్ర మహిళా ప్రపంచంలో గృహలక్ష్మి తన వెలుగు దివ్వెను వెలారిస్తుందని ఆశిస్తాము. 'ప్రజామిత్ర'

16-3-47.

గృహలక్ష్మి జనవరి సంచిక మా కార్యాలయం చేరింది. "జగమెరిగిన బ్రాహ్మణుడికి జంధ్యమేల" అన్నసామెత ప్రకారం గత 12 సంవత్సరాలు స్త్రీలకు రెంతో సేవచేసిన గృహలక్ష్మిని గురించి యెక్కువ వ్రాయుపనిలేదు. నాలుగు సంవత్సరాలు పత్రికా ప్రచురణ ఆగిపోయి 1947 జనవరినుండి ప్రచురణ ప్రారంభమైనది. గృహలక్ష్మి వ్యవస్థాపకులు శ్రీ కే. యన్. కేసరిగారు స్త్రీలవిషయంలో ఎంతో శ్రద్ధ చూపారు. ఇక వారి పత్రికద్వారా ఇంకా ఎక్కువ స్త్రీలోకానికి తోడ్పడగలరని ఆశించుచున్నాము గృహలక్ష్మి సర్వాంగ సుందరంగా ప్రతి గృహలక్ష్మి చేతిలోనూ వుంటుందని ఆశిస్తున్నాం.

'పడోసి' 47

నాలుగు సంవత్సరాల పాటు పరదా చాటున దాగిన 'గృహలక్ష్మిని' నూతన కాంతులతో డాక్టరు కేసరిగారు మళ్లీ మనకు అందిస్తున్నారు... మహిళోద్యమ ఆదర్శాలతో, స్త్రీసౌభాగ్యోన్నతికి పాటుపడే యీ మాసపత్రికకు మా ఆశీస్సులు.

'సూర్యప్రభ' మార్చి 47



# స్వీకారము-విమర్శ

**రూపవాణి**

రూపవాణి పత్రిక తన 9 వ జన్మదిన సంచికను ప్రత్యేక ప్రయత్నమున ప్రకటించినది. విమర్శార్థము మాకొసంచికను పంపినందులకు కృతజ్ఞులము. ఈ పత్రిక రాజకీయాలను, సినీమాకళను, జోడించి ప్రచారం చేస్తున్నది. సినిమా నటుల బొమ్మలు అందంగా ప్రచురింప బడ్డాయి. సినీమానుగూర్చిన వ్యాసాలున్నూ కొన్ని కలవు. భారతీయులు రాజకీయాల్లో ఒకవంక రాజ్యాంగ నిర్మాణ ప్రయత్నాలు చేస్తూ మరొకవంక విప్లవం కలలు గంటూ ఉండేరోజులివి. 1929 లో 1857 సం|| విప్లవం స్మరించడం, ఆచరిత్ర చెప్పుకోవడం అపరాధం. ఈనాడు ఎవరనోట విన్నా అవేగాథలు; ఏ పత్రిక చూచినా అవేవ్యాసాలు; అందుకు సంబంధించిన వారిబొమ్మలు. నేడుపళ్లంరాజుగారిని అల్లరి పెడుతున్న కాకినాడ ప్రజలు ముస్తఫాలీఖాన్ దురుద్యోగానికి మక్కిన పేలవలె నున్నరోజులలో, విప్లవ మార్గాల త్రొక్కిన శ్రీ భయంకరాచారిగారు ఆనాటి (1932) తన అజ్ఞాతవాసం, అరణ్యవాసాలు వర్ణిస్తూ వ్రాసిన వ్యాసభాగ మొకటి ఈసంచికకు మొదలైయుండడం సంతోషకరమైన సంగతి. ఢిల్లికిఢిల్లి, పల్లెకుపల్లె అన్నట్లు, 1857 సం|| నాటిసేనాని తాంతియాతోపే పరుగులకు, భయంకరాచారిగారి (శ్రీయుత ప్రతివాద భయంకర వెంకటాచారిగారు వీరి పూర్తి పేరు) పరుగులు పోలి ఉన్నవనవచ్చును. విధిగా నేడాంధ్ర పత్రిక లన్నిటా నిండియుండే సీతమ్మశోకం, 'పదిమంది కలిసి అధికార పదవిలోనుంచి ప్రకాశంగారిని కూలదోశారు'-అనేగాథను-గూర్చి కూడా రెండువ్యాసాలున్నవి. తగుమాత్రం, కథలున్నవి. ఒకజ్యోతిషవ్యాసమున్నది. అన్నిబాగా నేఉన్నాయి, గాని శ్రీ శ్రీరంగం నారాయణబాబుగారి "విరిబోడి" మాత్రం మాకు దిగ్భ్రమ కలిగించింది. ఇదినాలుగు పేజీలవ్యాసం. ఇందులో రెండుపేజీలకు పైగావితంతువులను గురించి వ్రాశారు. ఈ 'అధివాస్తవికునికి" ముండిత శిరస్కలైన వితంతువులపై మోహముదయించినది. అట్టివారు సంఘంలో కొందరు లేకపోరు. కాని వారంతా తమకు కలిగే నీచభావాలనన్నిటినీ పత్రికలనిండా వ్రాసి నారీలోకాన్ని పరాభవించరు; అట్టి అభాగ్యులు తమ అక్కచెల్లెండ్రో, కుమార్తెలో లేక సమీపబంధువులో ఎవరికైనా ఉంటారు. వారికిన్నీ తాముచెప్పినవి చెల్లుతాయనే స్పృహ ఈ వ్యాసకర్తకు లేకపోవడం విషాదకరము. ఇంతకూ శిరోముండనం చేసుకొనేది ఒక బ్రాహ్మణులే; అందులోనూ కొందరు వైష్ణవులు చేసుకోరు; వైశ్యులుకూడా కొందరీ ఆచారం అవలంబిస్తున్నారు. వితంతువునకు శిరోముండనం చేసే ఆచారం మేమున్నూ గర్హిస్తాము. పూర్వం పెద్దలు దాని నెందు కేర్పరచినా, ఈకాలంలో దానినిమాని వేయ దగును. శిరోముండనం చేయించుకోకుండానే స్త్రీ పవిత్రంగా ఉండడానికి అవకాశం లేకపోలేదు. కాబట్టి ఈముండన ప్రక్రియను మా వలెనే శ్రీనారాయణ బాబుగారు గర్హించేటైతే, అందుకు తగిన మార్దవంతో ప్రచారంచేసి దానిని సంఘంచేత మాన్పింప చేయడానికి ప్రయత్నం చేయ వచ్చు. లేక వారి కా "ముండిత శిరస్సే" శృంగార నిలయంగాతోస్తే తనకు నచ్చిన స్త్రీని, తన్నుప్రేమించనేర్చిన స్త్రీనే, వివాహం చేసుకొని ఆమె నట్లు "శింగారించుకొని" ఆనందలీలాడోలికల నూగులాడవచ్చు. కాని అభాగ్యులైన అనాథస్త్రీలను, సంఘమండలి నిరంకుశాచారానికి బలియైన వితంతువులను, ముండితశిరస్సులైన నీకవితకుమారుడు-మగనిల్ "అధివాస్త

పకుడు” కలము పోటుల ప్రసాదించి బాధించడం నీచము; తుచ్ఛము. కొందరికి క్రూరత్వము వహించి వినోదించడం ఒకమనస్తత్వము. అట్టితెగకే వ్యాసకర్త చెందునేమో యని మా అనుమానము. పూర్వుల నెత్తుకొని చూస్తే, చంద్రశేఖరశతకకర్త చెప్పిన ‘జాతీయమూ’ కాదు. కవిచౌడప్ప-నీతులతో సరితూచి చెప్పిన ‘బూతులూ’ కావు. ఆగ్రహాతిరేకమున కూచిమంచి జగ్గకవి చెప్పిన ‘చంద్రరేఖావిలాపము’ నందలి అసహ్యత నైనా చక్కగా పోషింపలేదు. శ్రీ నారాయణబాబుగారు తాము ‘అధివాస్తవికులము’ (Realist) అంటున్నారు. ఆంధ్రరచయితలలో మొదటి అధివాస్తవికులనదగిన శ్రీ గుడిపాటి వెంకటచలంగారి రచనలో, వెక్కసమైనా, సూటిగా, సరళంగా, రంగుపూయకుండా, సానుభూతితో వ్రాసే పోకడలున్నా ఇందులేవు. ఇది హాస్యమూ కాదు. అపహాస్యమూ కాదు. ఇందు సరసము లేదు. విరసము లేదు. కేవలము రసాభాసమూ; తికమక; యతిమతము; సతిమతము.

వీరి వ్యాసంలో ‘పీనుసరిడీ’ ‘బూదేని’ ‘గుల్ల అందం’ ‘విధవగుండు’ ఇత్యాదిపదాలు, ఇంకా ఇట్టివే భావాలు ఈ వ్యాసమును స్త్రీలు చదవడానికి యోగ్యతలేకుండా చేస్తున్నవి. ఇలాంటి వ్యాసాన్ని రూపవాణీ పత్రికా సంపాదకులు ఎట్లా ప్రచురించారనేదే మా ప్రశ్న. ఇది ఒక అధివాస్తవికపు పెండ్లిపాటకు ఉపోద్ఘాత మట. ఇదే ఇంత దగ్ధపటలంగా ఉన్నది. ఇక ఆపాట ఇంకెంత శ్రాద్ధయోగ్యంగా యున్నదో! అపాటను కూడా ప్రచురింపవలదని మాసలహా. నారీలోకానికి అమర్యాద కరమైన వ్యాసాలు ప్రకటించడం పత్రికా సంపాదకులకు మర్యాద కాదు కదా - వ్యాపార లక్షణమున్నా కాదని ‘రూపవాణి’ కి మేము వేరే చెప్ప నక్కరలేదు. అనేకవిధముల అందంగా ప్రచురింపబడిన ఈ జన్మదినోత్సవ సంచిక ఈ వ్యాసం మూలాన కురూపి అయిపోయింది. “అష్టవర్షాత్ భవేత్ కన్యా” అన్నారు. 9 సం|| ల పత్రికా పుత్రికను చిలిపి చేష్టలు నేర్వనివ్వరాదు.

వలయువారు రూపవాణి కార్యాలయానికి 16, సుంకురామ చెట్టివీధి జి. టి. మద్రాసు అని వ్రాయండి. వెల రు. 1-0-0 లు.

---

## విజ్ఞప్తి

“గృహాలక్ష్మి” యందలి రచయితల చిత్రపటములు ప్రచురింపుడని పలువురు కోరుచున్నారు. ఆకోరిక మాకదివరకేగల అభిలాషను ఇనుమడింప చేసినది. కాన క్లుప్తమగు తమ చరిత్రలతోపాటు చిత్రపటము లనుగూడ రచయితలు మాకంపగోరెదము.

సంపాదకుడు.




ఇరిన్ ఫ్లారెన్స్ కిల్బీ అనే ఆంగ్ల యువతి 20 సం॥ ల పడుచు. భారత సైన్యానికి చెందిన కెప్టన్ షెక్ మహమ్మద్ అస్సలాం గారిని లండన్‌లో వివాహంచేసుకున్నది. ఆమెకూడా అక్కడ సైన్యంలో పనిచేసినదేనట. కిల్బీ ఇస్లాం మతంలో చేరుతుందట గాని ఘోషా పద్ధతి మాత్రము అవలంబింపదట.

♦ ♦ ♦

కోడిగుడ్లు సులభంగా పగిలేస్వభావం కలవగుటచేత వాటిని ఉత్పత్తిచేసే వ్యవసాయ దార్లకు, అమ్మే వర్తకులకు హెచ్చునష్టం కలుగుతున్నది. అంతసులభంగా గ్రుడ్లు పగులని సాధనం కనిపెట్టాలని అమెరికాలో వ్యవసాయశాఖవారు పరిశోధనలు సాగించినారు. ముందు కోడిపెట్ట ఆహారంలో మార్పులు చేసి చూచారు. ఒకే ఆహారం తిన్న పెట్టలు పెట్టిన గుడ్లగుల్లల గట్టితనంలో భేదంకన్పించినది. అట్లాకాదని గట్టి గుల్లగల గుడ్లు పెట్టే పెట్టలను విడదీసి పరిశోధన లారంభించినారు. కొంతసాధనపై మంచి గట్టిగుడ్లు ఇప్పుడు లభ్యమవుతున్నవి. మాములుగా గుడ్లు 4 పౌ॥ ల బరువునకు పగిలిపోతాయి. ఈ పరిశోధన ఫలితంగా ఏర్పడ్డ కొత్తగుడ్లు 8 పౌ॥ల దాక బరువును భరిస్తున్నవట.

♦ ♦ ♦

ఆసియా మహాసభకు వచ్చిన కొరియా ప్రతినిధి వర్గంలో ఒకనారీమణికూడా ఉన్నది. ఆమె సభ జరుగుచుండగా ఒకనాడు వేదికపైకి వచ్చి వనితాలోకానికి శ్రీమతిసరోజినీదేవి చేసినసేవకు ప్రశంసా సూచకంగా ఒకకొరియన్ బొమ్మను కానుకగా యిచ్చినది. అట్లే నెహ్రూకున్ను, ఆసియావాసులకు చేసిన సేవకై మరొక కొరియా బొమ్మను కానుకగా యిచ్చినదట.

♦ ♦ ♦

కోయంబత్తూరులో మిల్లుకూలీలు-కాంగ్రెసు పక్షమువారు కమ్యూనిస్టు పక్షమువారు తరుచు కొట్లాడుకుంటున్నారు. ఈమాసారంభంలో రాధాకృష్ణ మిల్లు పనివారు కొట్లాడుకొన్నప్పుడు కొందరు స్త్రీలకు కూడా గాయాలు అయినవట.

♦ ♦ ♦

మద్రాసు ప్రభుత్వమువారు శ్రీమతులు ఎ. వి. కుట్టిమాలు అమ్మ ఎం ఎల్, ఏ, ఏ కే, మీనన్ సతిగార్లను, కాలికట్ పిచ్చి ఆసుపత్రికి అధికారేతర ప్రేక్షకులుగా నియమించారు. ఈపదవి రెండు సం॥ లు.

♦ ♦ ♦

గత 25 సం॥ లలో ఇంగ్లాండు, వేల్సు దేశాలలో గతించే జనంకన్న పుట్టేబిడ్డలు తక్కువగా ఉంటూ వచ్చినారు. ఈసంవత్సరము హెచ్చుగా పుట్టినారట.

గతమాసం సంచికలో యుద్ధకాలమున విదేశీయులు పెండ్లాడిన రష్యన్ యువతులను, భర్తృ దేశాలకు పోనివ్వడం లేదని విమర్శించి యున్నాము. ఆంగ్లయువకులు కొంతమంది తమరష్యన్ భార్యలను పిలిపించుకో జాలక బాధపడుతున్నారు. అయితే వారింతలో వదిలే వారుకారు. కాబట్టి-వారి విదేశాంగ మంత్రి-బెవిన్ ప్రస్తుతం రష్యాలో సాగిస్తున్న రాజ్యాంగ సమస్యల గూర్చిన సంభాషణలమధ్య ఈవిషయమైకూడ స్టాలిన్‌తో ఒకటికి రెండుసార్లు ప్రస్తావించారట.

♦ ♦ ♦

చైనాశాసనసభలో సభ్యుల సంఖ్య 2910. ఇదివరలో వ్రాయబడిన రాజ్యాంగచట్టాన్ని బట్టి 100 కి 5 మాత్రమే స్త్రీలకు ప్రత్యేకింప బడినవి. ఇప్పుడు మెజారిటీ సభ్యుల అంగీకారంతో 100 కి 10 స్థానాలు అనగా-292 స్థానాలు స్త్రీలకని చట్టంలోనే కేటాయించను నిర్ణయమైంది.

♦ ♦ ♦

తిరునల్వేలి జిల్లాలో కురుకుమలై యందు శ్రీసుబ్రహ్మణ్యస్వామివారి దేవాలయమున యొకనారీమణి బిడ్డను చంకపెట్టుకొని భక్తిపారవశ్యమున ప్రార్థిస్తూ ఉండెను. సమీపాన్నే ఉన్నదొంగ ఒకడదే సమయమని ఆబిడ్డమెడలో గొలుసు లాక్కున్నాడు. ఆమె అరవగా పరుగులెత్తినాడు. జనం అడ్డమై పట్టుకున్నారు. ఈలోపల వాడు ఆగొలుసు మ్రింగేశాడు. అదితెలిసి పోలీసులు వాడిని ఎక్సురే పరీక్షకంపించారు.

♦ ♦ ♦

ఫ్రాన్సుదేశమే ప్రపంచానికి మొట్టమొదలుగా సమానత్వము, స్వాతంత్ర్యము, సౌభ్రాతృత్వము అనే ఉదారభావములను ప్రసాదించినది. కాని ఆదేశంలో స్త్రీలు అంతగా స్వతంత్రలుగారు. 20|| లు క్రిందట ఫ్రాన్సు మధ్యమందుండే ఒకగ్రామంలో వాలంటైన్ బ్రెటన్ అనేకన్య తనపుట్టింటివారికన్నా పేదవాడైన ఒక్కయువకుని ప్రేమించి పెండ్లాడుదామనుకున్నది. అందుకు ఆమెతలిండ్రులు, అక్క అభ్యంతర పెట్టినారు. ఆమెకు మతిచెడ్డది. కొన్నాళ్లు పిచ్చి అసుపత్రిలో ఉంచి, పిదప ఇంట్లోనే ఒకగదిలో పెట్టి తాళంవేసి-పెండ్లి జరుగకుండా ఈ 20 సం|| లు కాపాడారు. నేడు 40 సం|| న ఆయువతిని పోలీసులు తెలిసి విడుదల చేశారు. సగం మతిపోయింది; ప్రశ్నలకు సరిగా సమాధానం యివ్వజాలకున్నది; దిగంబరిగా ఉంటుంది; ఉపవాసాలు చేసిచేసి చిక్కి శల్యమై పోయింది ప్రస్తుతం వైద్యుని వద్ద చికిత్స పొందుతూ ఉన్నది. పేదవాణ్ణి ప్రేమించిన దోషానికి ఆమెకెంత అవస్థ కలిగింది!

♦ ♦ ♦

సిప్రస్‌లో ఒకముసలి తురుష్క స్త్రీ ఉన్నది. పిహిదాలి ఆమెపేరు. ఆమె వయస్సు 120 సం|| లు. అంతముసలామె ఆప్రాంతంలోలేదట. గతమాసంలో 120 పుట్టినదినంపడుగ చేసుకొన్నది. తానింకా ఎన్నో సం|| లు బ్రతకాలని తనకున్నట్లు చెప్పింది. మంచి ఆరోగ్యం. శక్తులు, సామర్థ్యాలు ఏమీ ఉడగలేదు. పుట్టిన రోజున ఒకటే కోరిక అట; ఎన్నడో తీస్కొన్న కాలిజోడు అరిగిపోయింది; కొత్తజోడు కావాలట.

---

మార్చినెల గృహలక్ష్మిలో శ్రీమతి గాదె లక్ష్మీనరసమ్మగారి సమస్యా పరిష్కారము.

"ఏప్రిల్ ఫస్టుపూల్."

పోతుకూచి సత్యవతీదేవి. నెల్లూరు.

---